NAVASAKTI అణా Telugu Weekly







## కార్మిక కర్షకులారా! ఏకముగండు !!

సాలు చందా 3-0-0 ప్రతి బుధవారం సంపాదకుడు: మద్దూరి అన్నపూర్ణయ్య.

సంపుటం ౧. రాజమండ్రి 23-2-38 సంచిక ౧౧.

### సర్దార్ గురుముఖ సింగ్

★  ★

పూర్వం గదర్ పార్టీ నాయకుడు, ముల్తాన్ జైలులో నిరశన వ్రతం పూనాడు. అపాయస్థితిలో నున్నాడు



# ★ కాంగ్రెస్ కబుర్లు ★

మా ప్రత్యేక ప్రతినిధి

### గుజరాతీ భాష

కాంగ్రెసు విషయ నిర్ణయ సభ జరిగడానికి ఒక రోజు ముందు నేను హరిపూర్‌లో దిగాను. కాని, నేను చూసిన దృశ్యాన్ని బట్టి మరొక రెండురోజులు ముందుగా రావలసియుండేనని యెంతో విచారించాను. పట్టణం యెటుచూచినా—విఠల్ నగర్‌లో యెక్కడ చూచినా, గుజరాతీభాషే తప్ప మరొక భాషే కనబడ లేదు. ఇంతవరకు నేను త్రైన్లో నేర్చుకున్న హిందీ హరిపూర్‌లో సహాయపడకపోతుందా అనుకున్నాను. కాని, ప్రతినిధుల క్యాంపులు, ప్రేక్షకుల క్యాంపులు, పాయిఖానాలు, స్నానపు పళ్ళాయిలు, వంటశాలలు— వీటి అన్నిటిపైనా గుజరాతీభాషే గాని రెండో భాష కనబడ లేదు. వాలంటీర్లు మాటాడే భాష గుజరాతీ. పని చేసేవారు మాట్లాడే భాష గుజరాతీ. కొస్టైన్లు మాటాడే భాష. ఎవరికీ హిందీ తెలియదు. ఇంగ్లీషు అసలే మాట్లాడరు [illegible] కాంగ్రెసులో!

★

### ఉమ్మి వేయరాదు

కాని, ఒక్క విశేషం. ఎక్కడికి వెడితే అక్కడ Spit here (ఇక్కడ ఉమ్మి వేయుము) అని గాని Do not Spit here (ఇక్కడ ఉమ్మి వేయవద్దు) అని గాని, అద్భుతమైన ఒక్కటి యింగ్లీషులో వ్రాయబడి ఉన్నాయి. చివరనే ఆంధ్రుల శిబిరం వద్దకు వెళ్లాను. ఆం. రా. కాం. కమిటీ ఆఫీసు యెదురుగా Spit here అని వ్రాయబడ్డ అట్ట చూచాను. ఇదేమి చోద్యం అని చూచేసరికి, ఆ అట్టముక్క కట్టిన స్థలం ఉమ్మేందుకు ప్రత్యేకింపబడిఉండటం చూచాను. ఆశ్చర్యపడ్డాను గాని, సదరు స్థలంలో గాని ఉమ్మి వేయవద్దంటే అర్థం ఉన్నది గాని, ప్రతినిధుల బసలవద్ద, ప్రేక్షకుల బసలవద్ద పత్రికా విలేఖరుల శిబిరంవద్ద ఉమ్ములు వేయడం ఎందుకా అని కోపం వచ్చింది. తెలిపోతే, భోజనం టిక్కెట్లు అమ్మే కిటికీమీద, విషయ నిర్ణయ సభ టిక్కెట్లు అమ్మే కిటికీమీద ఎందుకు చెప్పండి యీ హెచ్చరిక? ఇది ఎందుకు వ్రాయవలసి వచ్చింది అంటే. పత్రికా విలేఖరుల టిక్కెట్లు కొనుక్కుని నా గదికి నేను వచ్చి, సామాను సర్దుకోబోతూంటే, గదిలో యెదురుగా Spit here అని వ్రాయబడి ఉంది! నిర్ఘాంతపోయాను నేను.

★

### కళానైపుణ్యం

విఠల్‌నగర్ యొక్క కళానైపుణ్యాన్ని- ముఖ్యంగా నందలాల్‌బోసుగారి చిత్రాన్ని- అనేక పత్రికలు ప్రశంసిస్తూ వ్రాసిన వ్యాసాలు చదివాను. ఇప్పుడు చూచి ఆనందిద్దా మనుకున్నాను. అన్ని విషయాల్లోనూ ఛిద్రాన్వేషణం చేయడమే సోషలిస్టులపని అంటే నేను చెప్పలేనుగాని, ఉన్నది ఉన్నట్టుగా వ్రాయవలసి వస్తే నేను ఆనందించలేక పోయాను. కాని, స్వదేశ ప్రదర్శనంలో ప్రదర్శింపబడ్డ భారతస్త్రీల జానపజీవితాన్ని గురించి నందలాల్‌బోసు చిత్రించిన బొమ్మలు చూస్తే మాత్రం నిర్ఘాంత పోయాను

### మృదులాబెన్ హోటల్

మర్నాటినుంచీ మహాసభ చర్చలు మొదలైన కార్యక్రమంలో మునిగి ఉంటాముగదా అని ఆరోజునే స్వదేశ వస్తుప్రదర్శనం చూడ్డానికి వెళ్లాను. టిక్కెట్టు రెండణాలు. గేట్లో టిక్కెట్టుకొనుక్కుని వెడితే ప్రదర్శనంఅంతా చూడవచ్చు ననుకున్నాను కాని, గాంధీగారి ఆపరేషన్ చూడ్డానికి ఒక అణా, మైసూరు మహారాజాయొక్క దంతపు సింహాసనం చూడ్డానికి మరొకఅణా, పద్మవ్యూహానికి మరొక అణా- యీవిధంగా సుమారు ఒకరూపాయివరకూ అవుతుందనుకోలేదు. అహమ్మదాబాదులో పెద్దమిల్లు యజమాని అయిన అంబాలాల్ సారాభాయిగారి కూతురు(అవివాహిత) మృదులాబెన్ ఆ ప్రదర్శనశాల లోనే ఒక కాఫీహోటల్‌ను మేనేజ్ చేస్తూందని అంద రిలాగానే, అక్కడికి వెళ్ళి చూచన్నాను. కొద్దిగా ఫల హారంచేసి చేతులుకడుక్కుని టేబిలువద్దకు వచ్చే సరికి ఆరణాల బిల్లు చేతిలో పెట్టింది. ఇంతట్లోకే గాంధీగారు ఉపన్యాసం యిస్తున్నారనే వార్త విన్నాను. ఎక్కడ అని అడిగాను. ప్రదర్శన శాల లోనే. అదికూడా విని బయటకువద్దాం అనుకున్నాను. దానికికూడా మరొక అణాపెట్టి టిక్కెట్టు కొనవలసి వచ్చింది.

★

### "రఘుపతిరాఘవ రాజారాం"

ఇక గాంధీగారి ఉపన్యాసం. ఆరోగ్యం సరిగా లేనందున ఆయన విషయ నిర్ణయ సభలోగాని మహాసభలోగాని ఉపన్యసించడని అందరూ చెప్పారు. ఈ అవకాశాన్ని విడిచిపెట్ట కూడదనే ఉత్సాహంతో వెళ్ళికూర్చున్నాను. కాని ఉపన్యాసంలేదు. యేమీ లేదు. గాంధీగారు, వల్లభాయిగారు వచ్చి ఉపన్యాస వేదికమీద కూర్చున్నారు. కొన్ని వేలమంది ప్రజలు వచ్చారు. దూర శ్రవణయంత్రాలు సభలో యెన్నో అమర్చబడి ఉన్నాయి. ప్రేక్షకులు శబ్దం చేయకుండా వాలంటీర్లు శాంతిని కాపాడుతున్నారు. నలుగు రైదుగురు స్త్రీలుమాత్రం లేచినిలబడి ప్రార్థన ప్రారంభించారు. "రఘుపతిరాఘవ రాజారాం, పతితపావన సీతారాం" అనేగీతం ప్రారంభించారు. సుమారు ఒక అరగంటసేపు పాడారు. ఏచరణంతో అయితే ప్రారంభించారో అచరణమే యీ అరగంటసేపూ పాడారు; ప్రేక్షకులు కూడా తాళంవేయటం మొదలెట్టారు. ప్రార్థన పూర్తిఅయింది. గాంధీగారు వల్లభాయిగారు నమస్కారంచేస్తూ వేదికదిగారు. అల్లరిచేయకండా ఎవరిప్రదేశాలకు వారు వెళ్ళిపోవాలని నాయకులు హెచ్చరించారు. అందరూ లేచారు. నేనుకూడా లేచి యీవలపడ్డాను. వస్తుప్రదర్శనం పూర్తిగాచూచి వంటశాలవద్దకు వచ్చాను. కాని టిక్కెట్లుమాత్రం అమ్మే సైము అయిపోయింది. డునాట్‌స్పిట్ హియర్ అనే అక్షరాలు మాత్రమే కనపడ్డాయి కిటికీమీద. భోజనం ఆరాత్రి ఒకహోటల్లో చేశాను. యు. పి., బీహార్ రాష్ట్ర ప్రధానమంత్రులిద్దరూ రాజీనామా యిచ్చారనే వార్త టెలిగ్రాంద్వారా వచ్చిందని తోవలో మరొక పత్రికావిలేఖరి నాతో అన్నాడు. ఈసమస్యను గురించి మహాత్ముడు తీవ్రమైన ఆలోచనలో పడటంచేతనే ప్రార్థనతో ప్రారంభించి ప్రార్థనతోనే ముగించారని ఊహించాను అప్పుడు.

★

### కెమెరాపన్ను

నాతో తీసుకొచ్చిన కెమెరాను ఉపయోగించి, కొన్ని చక్కని దృశ్యాలు ఫొటో తీసుకొందాం అని కుతూహలపడ్డాను. కాని,మరొక విలేఖరి నాకొక క్రొత్తసంగతి చెప్పాడు. పత్రికావిలేఖరులు ఫొటోలు తీసుకుంటే, వారుతీసిన కెమెరాలకు ఒకొక్కదానికి రు 25 లు రూ॥ న ఆహ్వానసంఘమువారికి చెల్లించాలని నాతో చెప్పాడు. కొన్ని సంవత్సరాలనుంచి నేను కాంగ్రెసు మహాసభలకు హాజరౌతూ వచ్చానుగాని, యీ కెమెరాపన్ను యెప్పుడూ ఎవరికీ యిచ్చుట ఎరుగను. అసలు పన్నులేతగ్గించమని ఆందోళనచేసే యీ రోజుల్లో యీ క్రొత్తపన్ను కట్టుటకు నాకిష్టం లేకపోయింది. కెమెరా ఎక్కడపోతుందో అనే భయంచేత దాన్ని మెడలోనుంచి తీసివేసి పెట్టెలోపెట్టాను.

★

### పన్నులబాధ

కాని హరిపూరులో యీ ఒక్క పన్నే కాదు విధించటం. ఏవైనా పుస్తకాలు అమ్ముకో దలచుకొంటే వారిపైన్ని పన్ను. కరపత్రాలు లేవైనా పంచిపెట్టవలచు లైసెన్సు. కాంగ్రెసు మైదానంలో ఎట్టి సభలు గాని ఊరేగింపులు గాని జరుపరాదు, ముందుగా అనుమతి తీసుకోకుండా. ఏ కాంగ్రెసులోనూ లేని యీ విషేషపు ఆజ్ఞలు, యీ పన్నులు, కాంగ్రెస్ ప్రభుత్వం చేయగలదురా అనిపించింది. కాని, విలేఖరు లేమి చేయగలరు వీటిని గురించి?

★

### చైనాభక్తులు.

అన్నింటికన్నా నామనస్సులో ఉద్రేకాన్ని రగుల్కొల్పిన దృశ్యం ఒకటి ఉంది. 90 అడుగుల పొడవుతో నిర్మింపబడ్డ జండాస్తంభంవద్ద— దానికి చాలా దగ్గరగా—ఒక నీలిరంగు జండా ఎగురుతూ ఉండడం చూచి, అదేమిటో చూచివద్దామని అక్కడికి వెళ్లాను. దాని ప్రక్కనే ఒక పెద్ద డోలు పెట్టుకొని చైనాదేశీయ బౌద్ధ మతస్థు డొకాయన రెండు కర్రలతో నెమ్మదిగా వాయిస్తూ, 'ఓం' 'ఓం' 'ఓం' అని నెమ్మదిగా అంటున్నాడు. ఆ జండా చుట్టూ మరొక యిద్దరు చైనాదేశస్థులే రెండు చిన్న డోళ్లు తీసుకొని 'ఓం' 'ఓం' 'ఓం' అంటూ తిరుగుతున్నారు. రాత్రింపగళ్ళు యీవిధంగా యీ చైనాదేశస్థులు'ఓం'శబ్దాన్ని ఉచ్చరిస్తూ డోలు కొడుతూ ఉంటారని విన్నాను. నెమ్మదిగా నేను వారిలో ఒకరిద్దరి వద్దకు వెళ్ళి యిదంతా యేమి టని అడిగాను. ఆ జండా చైనా జాతీయ జండా అనిన్నీ, ఈ 51 వ భారత కాంగ్రెసు మహాసభ దిగ్విజయం జరగాలని భగవంతుని ప్రార్థిస్తున్నామనిన్నీ ఆయన జవాబు చెప్పాడు. విని, యెంతో ఆశ్చర్యపడ్డాను. కాంగ్రెసు మహాసభ యొక్కకీర్తి, ప్రభావం ఖండ ఖండాంతరాలలో యింతవరకు వ్యాపించిందని ఉప్పొంగి పోయాను.

హరిపూర్ 16—2—'38

# స్వాతంత్ర్య పిపాసులందరూ గర్వించదగిన వీరసింహం గురుముఖసింగ్



బి. సి. మధుర్

పొడవైన-వెడల్పాటిముఖం, భయంగొల్పే పెద్ద పెద్దకళ్ళు, ఆజానుబాహువులు, సింహంలాంటి బలం; ఇవీ గురుముఖ సింగు ఆకృతి లక్షణాలు. తలఅంతా నెరసింది. కాని కంఠధ్వని సముద్రవని గంభీరగర్జన. ఇక ఆ 60 ఏండ్ల వీరుని ముసలివాడని అనడం ఎలా? యౌవ్వనం వయస్సులో ఉండదు. మానసిక స్థైర్య ధైర్యాల బట్టి ఉంటుంది. గతసంవత్సరం మార్చిలో అండమాన్ రాజకీయ ఖైదీలలో ఒకక్రొత్త జీవం కల్గింది. సంవత్సరాలకొలది 'సెల్యూలర్' జైళ్ళలోబడి, దీన ప్రపంచం యొక్క వార్తలకు దూరమై, తమ మాతృదేశ సమాచారాలు తెలిసికొనలేని నిర్భాగ్య నవ యువకుల మధ్యకు, స్వదేశ విదేశానుభవాలుగల గురుముఖ్‌సింగ్ రాగానే ఖైదీలలో ఒక నూతనోత్సాహం ప్రబలింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కల్లిబొల్లి మాటలు నమ్మి ప్రపంచ యుద్ధంలో మునిగియున్న ఇంగ్లండుకు ధన బల సహాయం చేయదలచారు మన నాయకులు. ఆరోజుల్లోనే ఒక సాయుధ విప్లవాన్ని లేవదీయడానికై అస్త్రశస్త్ర సమేతంగా బంగాళాఖాతం వైపుకు ఒక ఓడ వెళ్ళింది. 'కామాగాటామారూ' అనే మాట భారత విప్లవ చరిత్రలోమరచిపోరాని మాట. పంజాబ్ 'గదర్' పార్టీ నాయకుడు సర్దార్ గురుదత్తసింహ "కామా గాటామారూ"అనే నౌక మీద అమెరికానుండి ఆయుధ సామగ్రితో వచ్చాడు. బ్రిటిష్ సామ్రాజ్య దృష్టి నుండి చీమయైనా తప్పించుకోవడం కష్టం. అలాంటప్పుడు, తుపాకులు పిస్తోళ్ళు ఉన్న ఒక ఓడ తప్పించుకోవడం ఎలాగు? ఆ ఓడలో గురుదత్తసింహ మొదలగువారిని అరెస్టు చేశారు.

సర్దార్ గురుముఖసింహ్ కూడా ఆ ఓడలోనే వస్తున్నాడు. అమెరికాలో తన నౌకరీ వదలి భారతదేశంలో 'గదర్' పార్టీతో కలసి పనిచేయడానికి బయలుదేరాడు. 'కామాగాటామారూ' నౌకపైనున్నవారందరిపైన, పంజాబ్‌లోని, ఇతర రాష్ట్రాలలోని వందలకొలది నవ యువకులపైన ఒక కుట్రకేసు పెట్టబడింది. దానినే లాహోరు కుట్రకేసు అంటారు. 1916 లో ఈ కేసు జరిగింది. ఇతర మిత్రులతోపాటు గురుముఖసింగ్‌కు కూడా ద్వీపాంతరవాస శిక్ష విధింపబడింది.

అండమాను ద్వీపం—1919 నాటి అండమాన్—మండు టెండ—గుంటల్లో వర్షానికి నిండిన బురద నీళ్ళతో దాహం తీర్చుకోవడం—సెల్యూలర్ జైళ్ల కఠిన నియమాలు—ఈగలూ దోమలూ నిండిన ఆ కొట్లు—ఊహించండి! ఆ నరక కూపంలోనే బంధించబడినాడు గురుముఖసింగు. ఆ రోజుల్లో బయట షికారు చేయగూడదు. ప్రకృతి ఇచ్చిన గాలిని పీల్చే భాగ్యం లేదు. ఈ కొట్లలోనే కొబ్బరినూనె తీసే గానుగ లుండేవి. లోపలినుండి ఖైదీలు త్రిప్పేవాళ్లు. నూనె పిండి కొట్టు బయట కాన్విక్టు వార్డర్లు పోగుచేసేవారు. ఇలా చేయడంలో బయట ఎంత నూనె వచ్చిందీ లోపలి ఖయిదీలకు తెలియదు.

రోజంతా కష్టపడితీసిన నూనెను వార్డర్లు అమ్ముకొనేవాళ్లు. ఖయిదీలు ఎంతచేసినా తమ పని పూర్తి అయ్యేది కాదు. గురుముఖసింగ్ దీనికి అసమ్మతి తెలియజేశాడు. దాని వల్ల ఫలితం ఏమిటి? అమానుషంగా హింసించేవాళ్లు. అప్పుడప్పుడు ఈ దెబ్బలవల్ల మూర్ఛపోయేవాడు గురుముఖసింగ్. ఇలాంటి పనుల వల్లనే అతని మిత్రు డొకడు మృత్యువు వాత బడ్డాడు. ఆ పురుగులతో కూడిన అర్ధాన్నం తింటూ సెల్యూలర్ జైళ్ళలో బడి ఆస్వాభిమాని క్రుగ్గుతూఉండ వలసిందేనా? 1920 కాంగ్రెస్ ఆందోళన ప్రారంభమయి అండమాన్ ఖయిదీలను మాతృదేశానికి తీసుకరావలసిందిగా ఉద్యమం ప్రారంభమయింది. 1921 లో తన మిత్రులతోపాటు సర్దార్ గురుముఖసింగును మద్రాసుకు తీసుకువచ్చారు. కాని గురుముఖసింగ్ మనస్సు బయట రాజకీయ పోరాటంలో కలియాలని తహ తహలాడింది. జైలునుండి తప్పించుకొని నెమ్మదిగా విదేశాలకు పారిపోయాడు.

మొట్టమొదట ఆఫ్‌గనిస్థాన్ వెళ్ళాడు. అక్కడ అనుమానించారు. అరస్టుచేశారు. తాను రష్యానివాసినని చెప్పాడు గురుముఖసింగ్. రష్యావెళ్ళాడు. స్వాతంత్ర్యంగల్గిన ఆదేశంవంక జూస్తుంటే అతని మనస్సులో ఆందోళన రేగింది. రష్యా విప్లవాన్ని బాగా పరిశీలించాడు. తరువాత ఫ్రాంసు అమెరికాలకు వెళ్లాడు. ఆదేశాలలో అంతర్జాతీయ పరిస్థితులను బాగా అవగాహనం చేసికొన్నాడు. విదేశాలలో తిరుగుతున్నా-అక్కడ అరస్టుచేస్తారని ఏభయమూ లేకపోయినా-అతని మనస్సంతా మాతృదేశంమీద ఉంది. మళ్ళా భారతదేశానికి వచ్చాడు. ఎపుడువచ్చాడో ఎలా వచ్చాడో తెలియదు. ప్రభుత్వం కళ్ళల్లో దుమ్ముకొట్టి ఎన్ని సంవత్సరాలనుండి ఇక్కడున్నాడో తెలియదు. 1920 నుండీ అతనిపై వారంటూ ఉన్నది. వెదకడమూ మానలేదు. హఠాత్తుగా 1936 లో పోస్టాఫీసులో ఉత్తరం వేస్తూ ఉండగా పట్టుకొన్నారు. ఈసారి ఏకోర్టులోనూ విచారించకుండానే జైలులో బంధించారు. సామ్రాజ్యవాదపు సంకెళ్ళను విడగొట్టుకోడానికి అతనికి వీలు లేకపోయింది. ఇన్నాళ్ల ప్రభుత్వం పడిన కష్టానికి బదులుతీర్చుకో మొదలుపెట్టారు. ఇది సహించలేక నిరశనవ్రతం 17 రోజులు చేశాడు. తర్వాత 1937 మార్చిలో మళ్ళా అండమానులకు పంపారు. సర్దార్ గురుముఖసింగు వచ్చిన కొద్దిరోజులకే నిరశనవ్రతం ప్రారంభం అయింది. అందులో ప్రముఖభాగం తీసుకొన్నాడు సర్దార్. ఆముసలి బొమికలలో ఒకకొత్త ఉత్సాహం వచ్చింది. 54 దినాలు నిరశనవ్రతం చేశాడు. మహాత్ముని, భారతీయుల విన్నపం ఆమోదించి చివరకు నిరశనవ్రతం మానారు. అందరితోపాటు గురుముఖసింగు కూడ ఇండియాకు రప్పించబడ్డాడు. కాని త్వరలోనే జబ్బుచేసింది. మొదట ఆలీపూర్ జైలులోనుంచి తర్వాత లాహోర్, అక్కడనుండి మూల్తాను జైలుకు మార్చారు.

మళ్ళా ఆ మూల్తాన్ జైళ్ళ గోడలమధ్య భారత వీరసింహం నిరశనవ్రతం చేస్తున్నది. 60 ఏండ్ల వయస్సు - కష్టపరంపరలతో అత్యాచార అమానుషకృత్యాలకు బలియై గాయాలుపడ్డ దేహం-నిరశన వ్రతాలపైన నిరశనవ్రతం-అతని దేహం శిధిలమగుతున్నది. భారతీయ స్వాతంత్ర్యపిపాసకు చిహ్నం గురుముఖసింగు. ఇట్టి వృద్ధ నవయువకుని చూచి ఎవడు ఉప్పొంగడు.....

[ జనతా నుండి ]

హరీంద్రనాథ ముని



డక్కా జైలులో నిరశనవ్రతం చేసి చనిపోయాడు.

## ఈ విషాద గాథ విన్నారా?

### బెంగాల్ రాజకీయ ఖైదీలు

| | |
|---|---|
| డెటిన్యూలు | 450 |
| రాజకీయఖైదీలు | 700 |
| దేశంనుండి వెళ్ళగొట్టబడినవారు | 4 |
| చిటగాంగ్‌లో పరిచయపత్రము ఇవ్వవలసినవాళ్ళు | 21382 |

### జైళ్ల క్యాంపులలోని భీకర చరిత్ర

| | |
|---|---|
| ఆత్మహత్యలు | 11 |
| 1936—37 లో చనిపోయినవారు | 40 |
| పిచ్చిఎత్తినవారు | 34 |
| క్షయరోగ పీడితులు | 35 |
| క్షయరోగంచేత విడిచిపెట్టబడినవారు | 165 |
| ఇతర భయంకర వ్యాధి పీడితులు | 175 |

గురుముఖసింగ్ ఇంతవరకూ నిరశనవ్రతం మానలేదు. రాజకీయ ఖయిదీల సమస్య హరిపురములో విచారించుతున్నారు గనుక నిరశనవ్రతం మానివేయాలని పంజాబు కాంగ్రెసునాయకులు సలహానిచ్చారు. కాని గురుముఖసింగ్ మొదలగువారు "నిరశనవ్రతం సాగించడానికి మాకు న్యాయమైన హక్కు ఉన్నది" అని చెప్పారు. గురుముఖసింగుస్థితి అపాయకరంగాకూడా ఉన్నదని వార్తలు వస్తున్నాయి....

ఈవ్యాసకర్త కూడ గురుముఖసింగ్‌తో పాటు అండమానులలో నున్నాడు.

★

# ★ నర్తనశాల ★

ఆరోజంతా ఎడతెరిపిలేకుండా వర్షంకురిసి, చీకటి పడేసరికి కొంచెము వెలిసింది. ఆమహానగరపు వీధులన్నీ సుస్నాతలై ఒకవింత శోభ దాల్చినవి. రోదించి రోదించి, ప్రియునివల్ల ఊరడింపబడి తిరిగి హృదయశాంతి పొందిన ప్రియురాలి వదనంలో కన బడే ఒక క్రొత్త ఉత్సాహం. ధారాపాతంగా వర్షించి విరమించిన బొంబాయినగర వీధులందు గోచ రించినది.

తీవ్ర మనోవేదనతో, నిరాశతో, ఎడతెగని ఆలో చనలతో నడుస్తూన్న లోహిత శర్మకూడా, ఇరానీ విశ్రాంతిశాలలో కొంచెము తేనీరు తీసుకొని బడలిక తీర్చుకున్నాడు.

తిరిగి నడక సాగించాడు.

అతనికొక గమ్యస్థానంలేదు; ఒక నిర్ణీతకార్యమూ లేదు. కష్టసముద్రపు లోతులలో మునిగి తేలుతూ ఉన్న అతనిబోటి హతభాగ్యులకు ఒకటే గమ్యస్థా నము—హృదయ శాంతినిచ్చే మొగసాల; ఒకటే లక్ష్యము—తమ హృదయాల్లో తగిలిన సున్నితమ యిన గాయాల్ని మాన్పి, జీవితశోభకు నూత్నకాంతి తొడగే సుకుమారస్నిగ్ధ హృదయాన్వేషణ.

అతడింకా నడుస్తూనే ఉన్నాడు.

ఆరంగు దీపాలకాంతి, పరిమితిలేని అంతస్థులు గల ఆ సౌధాల వైశాల్యము, హాయిగా, నిశ్చింతగా, నిత్యయానంద స్వప్నంవలె జీవయాత్ర సాగిస్తూ పెన వేసుక తిరిగే యువతీయువకులు, పానీయశాలలు, శరవేగంతో కార్లలో దూసుకపోయే తెల్లదొరలు, ప్రపంచపు విలాసానందాలను ఘనీభవింపచేసి తమలో యిముడ్చుకున్న సినీమాశాలలు.—అన్నీ వింతగా లోహి తశర్మకు తోచినవి. అంతా ఆనందమే; సౌఖ్యమే; కాంతి వాతావరణమే; విలాస విభ్రమాలే; శతసహస్ర నవశక్తుల విజృంభణకూడా ఇంతటి ఆనంద వాతా వరణాన్ని కల్పించలేవు అనుకున్నాడు.

కాని:—తనస్థితి! జేబులోంచి పర్సుతీశాడు. లోని పైకాన్ని లెక్కించిచూస్తే, రెండురూపాయల ఏడు కానులున్నవి; ఈవిపుల విశ్వంలో ‘తనది’ అనే యావదాస్తియొక్క ఆర్థికపువిలువా అంతేనని తిరిగి శర్మ తనకుతానే ఊరట చెందాడు.

అతడలాగ నడుస్తూనే ఉన్నాడు.

‘పేవ్‌మెంటు’ వెనక్కితిరిగి చూశాడు. మోయ లేని బరువుమోస్తూ, నడుమువంచి నడుస్తూ, ‘శిల్కు లూ’ అని బొబ్బరిస్తూన్న చైనా యువకుడొకడు శర్మ వెనకాల నడుస్తూన్నాడు. కొన్నివేల మైళ్ళదూరంలో

ఏ చైనా పల్లెకోనలోనో ఉదయించిన ఆహత భాగ్యుడు పొట్టకూటికై బొంబాయి వచ్చాడు; కొన్ని వందల మైళ్ళదూరంలో ఒక తెలుగు పల్లెలో జనిం చిన తానుకూడా జీవయాత్రకై బొంబాయి వచ్చాడు. ఏమారపు కారణాలవల్ల వారిరువురూ ఒకే బాటను నడుస్తున్నారో!

సామ్రాజ్యవాద పీడితుడవై, ఖండాంతరాలు పట్టిన ఓ చైనా యువకుడా! నీ అవస్థకంటె నా అవస్థ ... అనుకున్నాడు. శర్మ.

## “కజ్జలరేఖ”

తానిప్పుడు ఏప్రాంతాలలో ఉన్నాడో చూశాడు. లాల్‌బాగ్‌లో ఉన్నాడు ప్రక్కనే ‘టర్నర్‌హాల్’ మిల్లు తీవ్రంగా పనిచేస్తున్నది. గాజు అద్దాలలోంచి హతభాగ్యులయిన కూలీలు కనబడు తున్నారు.

“యంత్రనిర్మిత శకటనేముల
అను సమానా క్రందనములో
నవసి నుసియై పోవుచుండిన
అస్థిపంజర మణుచున్నది.”

అని గట్టిగా అరిచాడు.

తన పాడుతెనుగు బొంబాయిలో ఎవరికి కావాలి

★

పరేల్ సమీపించాడు ఎదురుగా దొరల పానీయ శాల అతని దృష్టిని వీడినది. లోపల జంగీ విలాసినీ విభ్రమాల కోలాహలము, నిరంతర పానీయసేవ, నాట్యారాధన—శర్మకు మతిపోయినది. పానీయశాల సమీపించాడు. ‘జాజ్’ సంగీతము హృదయంగమ ముగా మ్రోగుచున్నది. ‘కౌంటర్’ వద్ద స్థూలకాయు డైన దొర కూర్చొని ‘పైపు’ ననుభవిస్తున్నాడు. శర్మ అతని నుద్దేశించి,

‘నమస్కారము.’ అన్నాడు.

‘ఎవరునువ్వు?’ అని సగర్వంగా ప్రశ్నించాడు. దొర. ‘క్షమించాలి. ఈవిశాల విశ్వంలో నిస్సహా యంగా, దీనంగా తిరిగే నిరుద్యోగిని. నాదొక శోక గాథ. కరుణకలిగి ఏదయినా ఉద్యోగము ఇప్పించ కోరుతాను.’

> అంకితము
> సూర్యకాంతకు

దొర బల్లమీదనున్న గంటమోగించాడు. ఒక బంట్రోతు ప్రవేశించి, ‘సార్’ అని నిల్చున్నాడు.

‘ఇలాంటి పశువుల్ని లోపలకు ఎలారానిస్తున్నావ్?’ అని శర్మను చూపించి దొర గర్జించాడు.

నిర్దయగా, పశుప్రవర్తనతో శర్మ గెంటివేయ బడ్డాడు. బయటకువచ్చి శర్మ రాల్చిన రెండు కన్నీటి చుక్కలూ రెండు రక్తాశ్రువులు.

ఇంకా నడుస్తూనే ఉన్నాడు.

‘దాదర్’ ప్రాంతాలకు వచ్చేటప్పటికి ఇతనికి స్ఫుర ణకు వచ్చినది—ఆంధ్రమహాసభ ఒకటి ఆప్రాంతా లలో ఉన్నదని. పార్సీకాలనీ ప్రవేశించాడు.

‘బొంబాయి ఆంధ్రమహాసభ’ అని బల్ల కట్టిబడిన ఒక భవనం చూసి, లోన అడుగుపెట్టాడు.

గదిలో ఒక బల్లముందు వ్రాసుకుంటూన్న ఒక ముసలాయన సాలోచనగా కనుబొమ్మలెత్తి

‘కోనే తుమా?’ అని మరాఠీలో ప్రశ్నించాడు.

‘క్షమించాలి. నేను ఆంధ్రుణ్ణి.’ అన్న శర్మ సమాధా నం విని లోపలకు రమ్మని సంజ్ఞ చేశాడు.

‘ఏం పనిమీద వచ్చారు?’ అని ఆ వృద్ధుని ప్రశ్న.

‘నేనొక మాన్య జీవిని. అనేక ఎత్తు పల్లాలతో కూడుకొన్న నా బ్రతుకుమీద నిరాశచెంది జీవనాధారం దొరకుతుందేమోనని యీ మహాపట్టణం వచ్చాను. సాటి ఆంధ్రులు ఇక్కడ ఉన్నారనియూ, వారిక్కడ సభ పెట్టారనీ, వింటే నా హృదయానికి ఒక నూత్న కాంతి ఇచ్చింది.’

> కథ

ఆ వృద్ధమూర్తికి నిర్ధనుడైన శర్మతో మాట్లాడ్డమే వెగటుగా తోచింది.

‘అవునయ్యా—తోటి ఆంధ్రులు ఇక్కడేనేమిటి—ఎక్కడా ఉన్నారు. దక్షిణాఫ్రికాలో, బర్మాలో—కెన్యాలో కూడా ఉన్నారు. బహుశః ధవళగిరి శిఖ రము మీద కూడా ఉన్నారేమో! ఉన్నమాత్రాన?.... ఇక్కడ సభ్యులకు మాత్రమే ప్రవేశం’ అని వృద్ధ మూర్తి ఉపన్యాసం సాగించాడు.

సెలవు తీసుకొని లోహితశర్మ తిరిగి నడక సాగిం చాడు.

‘ధన నిరంకుశతావ పావక
తామ్రవర్ణ జ్వలిత కీలా
తాండవములో నుడుకుచున్నవి
తనువు నంటిన మిగతశేషము’

అనుకున్నాడు. అనుకొని నడుస్తున్నాడు.

దాదర్ సౌందర్యం అతన్ని ఆకర్షించలేదు. రాత్రి తొమ్మిది దాటినది. జన ప్రవాహము, ట్రాముల అల్లరి, దీపాల కాంతి—యెప్పటివలెనే ఉన్నవి. వీటియందు దేనిమీద శర్మ దృష్టి లేదు. ఆలోచన—సారమే లేని ఆలోచన. అప్రయత్నముగా కోటుజేబులో చెయ్యి పెట్టి చూస్తే అతని కొక కవరు దొరికినది. ఉత్త రము తీసి చదివాడు.

‘వృథా, అడియాసలు వద్దు. నీ సామ్యవాద బోధ నలు కాని, నీ కావల్ మార్పుగాని నీకు యీషణ్మా త్రమైనా సహాయకారులు కావు; ఊహాసౌధముల లోంచి దిగి నీ దశ ఆలోచించుకో. పోలీసువారికి కొన్ని సహాయకారిగా వర్తించు. నీకు తగిన ప్రతి ఫలం నేను చూస్తాను’

తన పినతండ్రి సర్కిల్ యినస్పెక్టరు వ్రాసిన ప్రేమపూర్వక సందేశ మది!

విరసంగా నవ్వి, ఆ పుత్తరాన్ని ముక్కలుగా చింపి పారేశాడు.

★

సర్ జాన్ గ్రోటే, అండ్ మేడమ్ హెలియో ట్రోప్ అపూర్వమయిన మోటారులో ప్రయాణం సాగి స్తున్నారు. ప్రపంచమంతా ఆ స్నేహితులకు స్వర్గ తుల్యంగా ఉన్నది. టాక్‌లో సేవించిన ‘కాక్‌టెయిల్’ నిషా తగ్గలేదు యింకా. రాత్రి సవిలాసమైన నృత్య కేళీ విలాసాల్లో పాల్గొనడానికి ‘నైట్ క్లబ్’కు వేగం గా ప్రయాణం సాగిస్తున్నారు.

ప్రశాంతంగా ఉన్న వెన్నెల, మదిరాపానపు కుత్తు, ప్రక్కనే ఉన్న అందమైన జవరాలు—సర్ జాన్ గ్రోటే హృదయంలో వెర్రి కోర్కెలు రేకెత్తినవి. అప్రయత్నంగా చక్రం వదలి, హెలియోట్రోప్‌కు దగ్గ రగా జరిగాడు. యిరువురి పెదిమలూ కలుసు కున్నవి.....

హటాత్తుగా కారు ఆగిపోయినది. తీవ్ర బాధాపూ రిత మయిన మూల్గు కాముకీ కాముకులను తిరిగి ప్రపంచంలోకి తీసుకువచ్చినది.

యిరువురూ కారు దిగి చూశారు. చక్రములక్రింద మానవ శరీరము పడి వున్నది. అంతా రక్తమయము

(మిగతా 17 వ పేజీలో.)



# స్పానిష్ ప్రభుత్వ భవితవ్యం అంతా ప్రపంచ కష్టజీవులపైన ఆధారపడి వుంది!

కె. సత్యనారాయణ బి. ఏ (ఆనర్సు) బి. యల్.

స్పానిషు యుద్ధం 20 నెల్లనుంచి జరుగుచున్నది. దీనికి ఏదైనా అంత మున్నదా? ఉన్నయెడల, ప్రజా ప్రభుత్వం జయం పొందుతుందా? ఈ యుద్ధంనుంచి మనం నేర్చుకోవలసిన విషయా లేమిటి?

స్పానిషు యుద్ధం కేవలం ఒక అంతర్యుద్ధం కాదు. ప్రజాస్వామికాన్ని (Democracy), అన్యాయముగా ఎదిరించి నశింపజేయ పూనుకొన్నారు ఫాసిస్టు నిరం కుశ నియంతలు హిట్లరు, ముస్సోలినీ, ఫ్రాంకో, సాల జారు మొదలైనవారు స్పెయినులో.

స్పెయిన్‌కు సంబంధించినంతవరకు ఈ యుద్ధం యొక్క అర్థం ఏమిటి? స్పెయిన్‌లో ప్రజాపక్షాలన్నీ, ప్రస్తుత దుస్థితి పోయి, మంచి పరిస్థితులు ఏర్పడుట కొరకు, సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, మార్పు కావాలంటారు. ప్రస్తుత దరిద్రం, విద్యావిహీ నత, జమీందారీ నిరంకుశత్వం, మత సంస్థ యగు కాథలిక్ చర్చి యొక్క ధనిక బలం రాజకీయాధికారం పోవాలంటారు. ప్రజలు కోరే ఈ మార్పు వచ్చినా ఒప్పుకోమంటారు, పీడించడానికి, హింసించడానికి అలవడిన విద్రోహకరమగు మితవాద పక్షం.

తదితర ప్రపంచానికి, ఈ యుద్ధంయొక్క అర్థం ఏమిటి? ఫాసిజాన్ని యూరపు ఖండంఅంతా బలపరచ డానికి, హిట్లర్, ముస్సోలినీలు చేసే ప్రయత్నమేఇది. రాజకీయ చైతన్యం కలిగి దిన దినాభివృద్ధి అవుతున్న ప్రజల యొక్క ఉద్యమములను ఎదుర్కొనజాలక, పెట్టుబడిదారులతో గూడిన ధనిక వర్గం, భయంకర మగు ఒక నిరంకుశ నియంతృత్వ రూపం దాల్చింది ఇటలీ, జర్మనీలలో. ఎలాగైనా ఈ కష్టజీవుల పక్షాన్ని అణచివైచి, తనను తాను రక్షించుటకొరకై అంతిమ యత్నం చేయుచున్నది పెట్టుబడిదారుల వర్గం. ధనిక వాదము యొక్క ఈ అంతిమ దశనే ఫాసిజం అంటు న్నాం. ఈ అంతిమ దశలో, ఫాసిజాన్ని యూరపు ఖండ మంతా బలపరచడానికి ఇటలీ, జర్మనీలు చేసే ప్రయత్నాల్లో, స్పెయిన్‌లోని తిరుగుబాటు ఒకటి. జపాను, ఇటలీ, జర్మనీలు, ఈ ఉద్దేశ్యముతోనే అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకముగా ఒడంబడిక (Anti Comintern Pact.) చేసుకొనుట గూడ అందరికి తెలిసిన విషయమే.

తృప్తిపడిన సామ్రాజ్యవాదంలాగ కనుపిస్తుంది బ్రిటిషు సామ్రాజ్యవాదం. ప్రస్తుత మున్న సామ్రాజ్య పరిస్థితులు చెదరకుండా ఉంటే చాలునని బ్రిటన్ యొక్క విదేశ రాజనీతి తెలుపుచున్నది. అందుకనే యుద్ధంలోని దిగి అభివృద్ధి కోరుచున్న విప్లవ పక్ష లకు సహాయం చేయటం బ్రిటిషు సామ్రాజ్యవాద తత్వ మునకు వ్యతిరేకం, సహజంగా. అందుకనే విద్రోహ కరమైన ఫాసిస్టులకే సహాయకంరగా ప్రవర్తిస్తున్నది బ్రిటిష్ సామ్రాజ్యవాదం. సామ్రాజ్యవాదం, ఫేసిజం, ఈ రెండూ వేటకుక్కలు-తోడిదొంగలు.

స్పానిషు గవర్నమెంటుకు విజయం చేకూరిందా, సామ్రాజ్యవాదం, ఫేసిజం గూడా దెబ్బతిన్న వన్న మాటే. శ్రామికులకు వ్యతిరేకములగు ఈ రెంటికీ అపజయం చేకూరి, నశించేటందులకై, అన్ని దేశము లలోని ప్రజాపక్షాలు ఐక్యమై, స్పానిషు ప్రజా ప్రభు త్వానికి సహాయపడాలి. అనగా ఒక గొప్ప అంతర్జా తీయ శ్రామికుల పక్షం అవసర మగుచున్నది.

స్పెయిన్ ఈరోజు ముట్టడికాబడిన ఒకకోట. బయటనుంచివచ్చే సహాయంమీదనే ఆధారపడి యున్నది. స్పానిషు ప్రజా ప్రభుత్వముయొక్క విజ యం, ఇంతవరకూ స్పానిషు గవర్నమెంటు ఫాసి స్టుల మారణయంత్రముల నెదుర్కొని యుద్ధం చేయ గలిగిందంటే, కష్టజీవుల (కార్మిక, కర్షకుల) ప్రభు త్వమగు సోవియట్ యూనియన్‌యొక్క సహాయం వల్లనే, సోవియట్ యూనియన్‌లోని కార్మికకర్షకు లందరు తమకు సాధ్యమైనంతవరకు ఆయుధములను, ధనమును, ఆహారపదార్థాలను, పంపిస్తూనే యున్నారు. బహిరంగముగా, ఫాసిస్టు ఇటలీ, జర్మ నీలు విద్రోహులకు సహాయం చేస్తూన్నట్లు, సోష లిస్ట్ సోవియట్ యూనియను చేయుటకు, రాజకీయ పరిస్థితులవల్ల వీలులేదు. సోవియట్ యూనియను బహిరంగముగా స్పెయిన్‌కు సహాయం చేసినదంటే, పెట్టుబడిదారీ దేశాలన్నికలసి కష్టజీవుల ప్రభుత్వమగు సోవియట్ యూనియన్‌మీద దండెత్తిన వన్నమాటే. 1917 రష్యావిప్లవం జరిగిన వెంటనే సోషలిస్టు ప్రభుత్వ స్థాపనగాకుండ చేయుటకు, ఈదేశీయులే రష్యామీద యుద్ధం చేయలేదా? రష్యాను ఏక్షణం నాశనం చేద్దామా అని ఆతురత పడుతున్నది. ఈ పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద- ఫేసిస్టుదేశాల ముఠా, ఇటలీ, జపాన్, జర్మనీల కామింటరన్ వ్యతిరేక ఒడంబడికయొక్క అర్థం అదేకదా? ఇటువంటి పరి స్థితులలో, కార్మిక కర్షక పక్షాలు పెట్టుబడిదారీ దేశా లలో, వృద్ధికాకముందే సోవియట్ యూనియన్ యుద్ధానికి దిగటంలో, అర్థంలేదు. అలాచేయుటవల్ల ప్రస్తుతం స్థాపించబడిన ఒక సోషలిస్టు ప్రభుత్వం గూడ నాశనమగుటయే ఫలితం. కనుకనే రష్యా బహిరంగంగా స్పెయిను ప్రజా ప్రభుత్వమునకు సహాయం చేయుటానికి వీలులేదు.

ఇక రహస్యముగా చేయుటగూడ కష్టము. దీనికి కారణం రాకపోకసంబంధాలు అనువుగా లేకపోడవం. అయినప్పటికి ప్రజా ప్రభుత్వమునకు రష్యా సహాయం చేస్తూన్నమాట వాస్తవం, స్పానిషు ప్రజా ప్రభుత్వం ఓడి, ఫాసిజం జయంపొందితే, అది రష్యాకు హాని గదా? ఫాసిస్టు నిరంకుశత్వాన్ని నాశనంచేసి సామ్య వాద స్థాపనకై సోవియట్‌రష్యా పూనుకున్నదనే విషయం గుర్తించాలి అందరు.

ఒక సోవియట్ రష్యాయేగాదు. అన్నిదేశముల లోని కార్మికకర్షక పక్షాలన్నీ స్పెయిన్ ప్రజా ప్రభు త్వానికి సహాయంచేసి రక్షించాలి. ముట్టడికాబడిన స్పెయిన్ ప్రజాప్రభుత్వం, వివిధదేశాలలోని ప్రజా పక్షాలు స్పెయిను యుద్ధముయొక్క నిజమైన అర్థాన్ని గుర్తెరింగి సహాయపడేంత వరకూ, నిలబడ గలి గిందా, తప్పక జయం పొందుతుంది. స్పెయిన్ ప్రజాప్రభుత్వమే కాదు. ప్రపంచమంతటా ప్రజాస్వా మికము (Democracy) నకు జయం కల్గినదన్న మాటే. స్పెయిను ప్రజాప్రభుత్వము అంతవరకూ నిలబడ గలదా? స్పష్టముగా నిలబడగలదనే తెలుస్తుంది

(మిగతా 18 వ పేజీలో)



★ విద్రోహులను నెదిరించుచున్న స్పానిష్ వీరులు ★

# నేటి ప్రపంచం

★ ఈడెన్ రాజీనామా
★ ఆస్ట్రియా—జర్మనీ సంధి
★ బ్రిటిష్ ఫాసిస్టుతత్వం
★ జర్మనీతో సంధి
★ ఇటలీతో సంధి
★ లిట్వినాఫ్ కోర్కె

### ఈడెన్ రాజీనామా

రాబర్ట్ ఆంథోనీ ఈడెన్ రాజీనామా ఇచ్చాడు. ఈడెన్ విదేశ రాజ్యాంగ కార్యదర్శి. ఆయనతోపాటు సహాయ కార్యదర్శి లార్డ్ క్రేన్‌బార్న్ కూడా రాజీనామా నొసంగాడు. ఈ రాజీనామా వల్ల బ్రిటన్‌లో మంచి క్లిష్టపరిస్థితులే సంభవించాయి. ఈ రాజీనామాకు కారణం ఏమిటి? దీని అంతరార్థం ఏమిటి అని ఆలోచించితే దీనికి ఆస్ట్రో—జర్మనీ సంధికి సంబంధం ఉన్నదని స్పష్టమగుతుంది.

### ఆస్ట్రియా—జర్మనీల సంధి

ఆస్ట్రియాకు జర్మనీకి సంధి జరిగింది. ఈ సంధి 2 సమాన స్థాయిలో నున్న స్వతంత్ర దేశాలు చేసుకొన్న సంధిలాంటిది గాదు. జర్మనీ ఆస్ట్రియాను మ్రింగి పూర్తిగా జర్మన్ సామ్రాజ్యం క్రింద పాలించాలని అభీష్టం. కాని ఈ సంధి వల్ల అంత పని జరక్కపోయినా దాదాపు అంతే అయింది. ఈ సంధి పిల్లికీ, ఎలుకకీ జరిగే సంధిలాంటిది. ఈ సంధిలోని షరతులన్నీ బయటకు రాకపోయినా మనకు తెలిసే విషయాలివి. ఇదివరకు ఆస్ట్రియాలో నాజీపార్టీపై గల నిషేధం తొలగిపోతుంది. కొత్త మంత్రివర్గంలో నాజీపార్టీ సభ్యులున్నారు. ఇందుకు జర్మనీ అనుగ్రహించిన దేమిటి? నాజీపార్టీ ప్రచారం ఆస్ట్రియాలో చేయకుండా ఉండటం. కమ్యూనిస్టువ్యతిరేకపు ఒడంబడికలో ప్రత్యక్షంగా చేరకపోయినా, పరోక్షంగా చేరినట్లే లెక్క. హిట్లర్ వాగ్దానం ఇచ్చినా, నాజీపార్టీపై నిషేధం తొలగి, మంత్రివర్గంలో తమ వారుండగా ఊరుకొంటారా? అందులో ఈ ఒడంబడికతో పూర్తిగా లొంగిపోయిన ఆస్ట్రియాప్రభుత్వం ఉండగా మెదలకుండా కూర్చుంటారా? కూర్చోడం అసంభవం. ఒకప్రక్క నాజీపక్షమూ బలపడుతుంది. మరోప్రక్క కమ్యూనిస్టు వ్యతిరేక ఒడంబడికా బలపడుతుంది.

ఈసంధిని "ద్రోహం" అంటూ వియన్నా కార్మికులు తమ రోషాన్ని వెల్లడించగలిగారే కాని, ప్రభుత్వాన్ని లొంగదీయలేకపోయారు. ఈనాడు ఆస్ట్రియాలో కార్మికుల కంత బలం ఉన్నట్లు కనబడదు. ఈ జర్మనీ—ఆస్ట్రియా సంధివల్ల బ్రిటన్ కేమి ముప్పు వచ్చింది?

### బ్రిటిష్ ఫాసిస్టు తత్వం

ఫేసిస్టు దేశాలలాగా బ్రిటన్ కొత్త వలసదేశాలు కోరడంలేదు. తమ సామ్రాజ్యం తాము పోగొట్టుకోకుండా ఉంటే చాలు. తమ సామ్రాజ్యం పోకుండా ఉండటానికి ఎవరిపక్షం వహించాలా అన్నది బ్రిటన్‌కు పెద్ద సమస్య. ఎటు బలం ఉంటే అటు మొగ్గాలని ఊగులాడుతున్నది. ఇందుకోసరం తమ పాత కాలనీలు కొన్ని పోయినా సరేనని ఒప్పుకొనేందుకు సిద్ధమైంది బ్రిటన్.

### జర్మనీతో సంధి

కమ్యూనిస్టు వ్యతిరేకపు ఒడంబడికతో ఫేసిస్టులంతా బలపడుతున్నారని బ్రిటన్ కూడ భయపడింది. అందుకని వారిలో చీలికలు గల్గించాలని ప్రయత్నం. ఈ చీలికలో జర్మనీపక్షం వహించాలా, ఇటలీ పక్షం వహించాలా అన్నది మరో సమస్య. జర్మనీకి కొన్ని వలస భాగాలు ఆఫ్రికాలో ఈయాలని కొందరు పెద్దలు తలచారు. వారిలో ప్రధానమంత్రి నెవిలీ ఛాంబర్లెన్, లార్డ్ హాలిఫాక్సు (ఇర్విన్) లోథియన్ మొదలైనవాళ్లు. వీరికి టైమ్సు అబ్జర్వు పత్రికా సంపాదకులు కూడా తోడ్పడి విశేష ప్రచారం గావించారు. హిట్లర్‌కు మధ్య-తూర్పు యూరప్‌లో అతని ఇష్టం వచ్చినట్లు పోవడానికికూడా సమ్మతించారు ఈ మహానుభావులు. అందుకు ముందు ఆగాఖాన్ రాయబారం జరిపాడు. హాలిఫాక్సు హిట్లర్‌సమావేశానికి హాలిఫాక్సు హిట్లర్‌ను దర్శించాడు. కాని లాభం కలగలేదు. అప్పుడే రెండుసార్లు ఈడెన్ రాజీనామా నివ్వాడని వదంతులు పుట్టాయి. కాని ఎలాగో సర్దుకొన్నారు. ఇపుడు హిట్లర్ బలపడ్డాడు. అతడు తమని లక్ష్యం చేయడం లేదు. కాబట్టి ఇటలీతో సంధి చేసికోవాలని ఈ ఫేసిస్టు అనుకూలపక్షం ఊగులాడింది. ఇటలీతో సంధి చేసికొని ఫేసిస్టులను చీల్చి తమ సామ్రాజ్యం చక్కబెట్టుకోవాలని వీరి అభిప్రాయం. ఇదే రాజీనామాకు కారణం అయింది.

### ఇటలీతో సంధి

మధ్యయూరప్‌లో జర్మనీ బలపడితే తనకు పోటీ అవుతుందనే ఈ భయం. ఇటలీతో సంధి అంటే ఎలా? ఇథోపియాను కళ్ళారా చూస్తూ అప్పగించారు. ఇపుడు ఇటలీ ప్రభుత్వాన్ని అంగీకరించి ఆ దేశస్థులకు ద్రోహం చేయాలి. రెండవది స్పెయిన్‌లో వలంటీర్ల సమస్య తేలకముందే తటస్థభావంకూడా మాని ముసోలినీకి కావలసినంత స్వేచ్ఛ స్పెయిన్‌లో కలుగజేయడం. ఇలా స్పెయిన్ ప్రభుత్వానికి ద్రోహం. ఈ రెండు ద్రోహకృత్యాలకు ఒడిగట్టితేనే ఇటలీతో సంధి కుదురుతుంది. ఇదివరకు ఈ రెండు దేశాలకు ద్రోహం చేయలేదా అంటే చేసింది. కాని అంత బాహాటంగా కాదు. ఈసంధి వల్ల పూర్ణంగా ఫేసిస్టుల దోపిడికి బ్రిటన్ సహాయపడుతుంది.

అటు జర్మనీతోగాని ఇటు ఇటలీతోగాని సంధికి ఈడెన్ మొదటినుండీ ప్రతికూలుడు— అందువల్లనే స్పానిష్ సమస్య తేలనిదే ఈ రాయబారాలు వద్దన్నాడు దానితో భేదం వచ్చింది. ఈడెన్ రాజీనామా ఇయ్యాలిసి వచ్చింది.

### లిట్వినాఫ్ కోర్కె

బ్రిటన్‌లో ఇంత తొందర ఎందుకు పుట్టింది. బోల్షివిజం ఆపడానికి జపాను జయించితేనే బాగుంటుందని ఇవాళ హిట్లర్ ఉపన్యాసం. ఈ ధోరణి బ్రిటనుకు అర్థమయింది ఇదివరకే. అటు జపాన్‌ను ఎదిరించాలంటే ఈ ఫాసిస్టు ముఠాలని చీల్చాలి. అందుకే అంత ఆదుర్దా. అయితే ఈ జపాన్ దాడిని ఆపడానికి. ఫ్రాంసు ఇంగ్లండులు సహాయం చేస్తే ఈనాడు నేను తయారు జపాన్‌ను చావదన్నటానికంటూ లిట్వినాఫ్ చెప్పాడట. ఈ విషయం న్యూస్‌రివ్యూ చెపుతున్నది. జనవరి నెలాఖరున జరిగిన లీగ్ కౌన్సిల్ వ్యవహారంలోంచి ఇది. కాని బ్రిటన్‌కు ఆధైర్యం లేకపోయింది. లిట్వినాఫ్ కోర్కె గొంతెమ్మ కోర్కె అయిపోయింది.

### బ్రిటన్ భవిష్యత్

ఈ క్లిష్టపరిస్థితులు ముందు ఎలా మారుతవో మనం పరీక్షిస్తూ ఉండాలి.

ఈడెన్‌ను ఈ విషయంలో మెచ్చుకోవచ్చు ఒకవిధంగా ఫేసిజానికి అయిష్టత తెలిపాడు గనక. ఇతని స్థానంలో హాలిఫాక్సు ప్రభువు (ఇర్విన్) విదేశ రాజ్యాంగ కార్యదర్శి అయాడు. తాత్కాలికంగా అంటే బ్రిటన్ పూర్తిగా ఫేసిస్టుల మిత్రులది అవుతుంది.

ఈడెన్‌కు అతివాద కన్సర్వేటివ్‌లలో పలుకుబడి ఉంది. కాని ఈ మార్పులవల్ల ఎందరే పక్షానికి పోతారో చెప్పడం కష్టం. ఒకసారి బెర్నార్డ్‌షా మాగ్డనాల్డును గురించి "ఈయన పదేండ్లక్రితం చనిపోతే బాగుండేది" అని అన్నాడు. అలాగే ఈడెన్‌కూడ ఇథోపియా సమస్యమీద లీగ్‌తరఫున తనకున్న పదవిని 1935 లో వదలుకుంటే బాగుండేది.

### టెరూల్ యుద్ధం

ఇదివరకు స్పెయిన్‌యుద్ధంలో మాడ్రిడ్ పేరుగాంచింది. ఈరెండు నెలల నుంచీ టెరూల్. దీనిమీదే రెండుపక్షాల భవిష్యత్తు ఆధారపడివుందని అందరూ తలచుతున్నారు. ఇక్కడ విద్రోహులెంత పట్టుదలతో ఉన్నారో అంతకంటె ధైర్యంగా ప్రభుత్వం ఎదిరించుతున్నారు. ముఖ్యంగా "ఇంటర్నేషనల్ బ్రిగేడ్" లోని లింకాలన్ బెటాలియన్ ప్రభుత్వాన్ని రక్షిస్తున్నది. ఇదివరకు మాడ్రిడ్‌లో అసమాన ధైర్యసాహసాలు చూపించారు వీరు. వీరిలో ముఖ్యంగా అమెరికన్ వాలంటీర్లు ఉన్నారు.

ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లో వివిధ దేశాల వాలంటీర్లున్నారు. వీరు స్పెయిన్ తమ దేశం కాకపోయినా, ఫేసిస్టు క్రూర కృత్యాలని అరికట్టడానికి, ప్రజాస్వామ్యాన్ని రక్షించడానికి స్పెయిన్ వెళ్ళారు. ఇలాంటి వలంటీర్లలో ఎందరో మేధావులుకూడా ఉన్నారు. గత సంవత్సరం రాల్ఫుఫాక్సు అనే సుప్రసిద్ధ బ్రిటిష్ కమ్యూనిస్టు ఈ బ్రిగేడ్‌లోనే ఉండి విద్రోహుల చేతిలో చనిపోయాడు. రాల్ఫుఫాక్సు "బ్రిటిష్ సామ్రాజ్యవాదం యొక్క వలస రాజనీతి" అనే గ్రంథంలో మన దేశ దుస్థితి కూడా వ్రాశాడు. ఇలాంటి వారెందరో స్పెయిన్‌లో మరణించారు. ఇంక దీనికి అంతు....





# మహిళా సంఘాలలో పాటకపుజాతి స్త్రీలకు స్థానమివ్వాలి

★ శ్రీమతి సుహాస్ ★

పరదా విధానము బహుభార్యత్వం మొదలైన సమస్యలు పాటకపుజాతి స్త్రీలకంత లాభదాయకముగానుండవు. సాధారణంగా యీపాటకజాతి స్త్రీలు, స్త్రీపురుష భేదం పాటించక, వాళ్ళ జీవితవ్యయాన్ని సంపాదించుకునే వారిగా ఉండుటచేత ఉన్నతవర్గపు స్త్రీలకంటే కొంచెం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు గలవారై ఉంటారు. సమాజం, వ్యక్తులూ శాస్త్రాలు వారి నవమానపరచినా వాళ్లు పురుషులకంటే హీనంగాఉన్నా, వాళ్ళపై పురుష నిర్బంధం చాలతక్కువ. యీపాటకజాతి స్త్రీలలో నూటికి. ఏబదిమందిపైగా స్వంతఆస్తి అనేది లేక, నిర్బంధ వైధవ్యములేదు. కనుక వారికంతగా వారసత్వపు హక్కుల్నిగురించి బోధించ నవసరంలేదు.

అధిక శ్రమపడే యీపాటకపుజాతి స్త్రీలకు ఫాక్టరీ చట్టాలుగాని, పన్నులుగాని అంత లాభకరంగా లేవు. ఉన్న స్వల్పమైనా వాటిఫలితంలేదు. యీపాటకపు జాతి స్త్రీలు స్వేచ్ఛగా సంపాదించుకోగల అవకాశమిచ్చేరంటే అదీ లేదు. వారికుండే స్వల్ప ఆర్థిక హక్కునీ ఇనప సంకెళ్ళతో బిగించేరు. వీరికి శ్రమకు తగ్గ ఫలితం లేదు. సౌఖ్యంలేదు. వారి కేవిధమైన వైద్యసహాయంగాని విద్యా సౌకర్యాలుగాని లేవు. వారిబిడ్డలకు తగిన సౌకర్యాలులేవు. పాటకపుజాతి స్త్రీ దోపిడిగాండ్రచేత కీలుబొమ్మయినది. ప్రభుత్వానికి యీదోపిడిగాండ్రు భాగస్థులవుటచేత వారి కేవిధమైన బాధ్యతాలేదు. ఫాక్టరీ యజమానులకుగాని, భూస్వాములకుగాని ఏవిధమైన జంకూ లేదు. యీదోపిడిగాండ్రు పరమ మూర్ఖులై, నిర్దాక్షిణ్యులై నవీరిలో దయాధర్మమనునవి పూర్తిగా నిర్మూలమైనాయి వారికుండే స్వల్పస్వేచ్ఛనీ ధనిక.నిరంకుశత్వానికి, బీద పాటకపు జాతి స్త్రీలను బలి చేస్తూన్నారు.

యీ కూలీ వర్గపు స్త్రీలు విద్యావిహీనులైరి. వారి అజ్ఞానాన్ని, వారి కుండే బానిసత్వాన్ని మరచి, సమాజానికి దూరమైరి. యీ పాటక స్త్రీల బానిసత్వాన్ని రూపు మాపుటకు, ఏప్రభుత్వమూ కూడా ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. దేశంలో యిన్నివేలమంది పాటకపు స్త్రీలు నిరక్షరాస్యులై అంధకార కూపంలో మునిరుగిపోయారు. ఈ స్త్రీల అధోగతి యింతవరకూ బూర్జువా మహిళా సంఘం గ్రహించలేదు. వయస్సు చెల్లినవారి నటుంచి వారి పసిబాలికలకైనా విద్యా సౌకర్యాలు లేవు. యిట్టి పరిస్థితుల్లో వారి తల్లి తండ్రులా నిత్య దరిద్రులూ, నిరక్షరాస్యులూ అవుటచేత తమ సంతానాన్ని రక్షించుకోలేకున్నారు.

ఈవిధంగా అడుగడుక్కీ బంధించబడి కూటికీ గుడ్డకీ కరువుపడిన యీకూలిజాతి స్త్రీలను, బాలికలను యీ అనాధ స్త్రీలను, బాలికలనూ నిస్సహాయులయి మురికిగుంటల్లోను, రోడ్లప్రక్కలా దొర్లుతూ క్షీణించే బాల బాలికలను నిత్యమూ చూస్తున్నాము. నలుగురి చేత దోపిడీ చేయబడే కూలీ స్త్రీకి దోవ తెలియక ధనికులచేత సమాజంచేత ప్రభుత్వంచేత జిక్కి దుర్మార్గాలకి నీచత్వానికి దాసులైరి.

యీవిధంగా వారి నణచి అజ్ఞానుల్ని, మూర్ఖుల్నిగాను చేసిన సమాజాన్ని, నిరంకుశ బానిస శాస్త్రాల్ని ప్రభుత్వాన్ని, యింత అజ్ఞానంలో ఉన్నా తెలుసుకోలేదు బూర్జువా మహిళలు.

పైగా యీస్త్రీలలో దుర్మార్గం, నీచత్వం, అపరిశుభ్రత ప్రబలించని యీ పాటక జనాన్ని చూచి అసహ్యించుకుంటారు. తమ సంఘాల్లోకి వార్ని రానివ్వరు. తుదకు చేతనైన బూటకపు మత నీతి బోధ వారి ముందు వెళ్ళగక్కుతారు తప్పెవరిది? యీవిధంగా వారి మీద అధికారం చెలాయించి అవినీతికి దింపి వారి నధోగతి చేసినఉన్నత వర్గపు స్త్రీ పురుషులదా! కాక మరెవరిది.

యీ పాటకజాతి స్త్రీ దోపిడీకి ధనిక వర్గం, బూటకపు టాచారం ఉన్నత వర్ణపు స్త్రీల స్వేచ్ఛనని జ్ఞప్తికి రాదు.

వారి కేలాంటి విద్యా సౌకర్యాలు లేకపోవుటచేత వారి స్థితి నానాటికి హీనస్థితిలో కొచ్చి సమాజానికి దూరమవుతున్నారు.

యింత నికృష్టదశలో ఉన్న యీ పాటకపు స్త్రీలను, మన జాతీయ నాయకురాండ్రు, జాతీయసంస్థలు ఎంత ఉదారత్వం చూపిందో గాని వీరి స్థితి నానాటికీ క్షీణించి, చైతన్యహీనులైరి. పశుజీవనంకంటే నికృష్టంగా ఉన్నారు.

యీ పాటకస్త్రీ పురుషునితో సమానంగా సరుకులనుత్పత్తి చేసినప్పటికీ వారిపై నిరంకుశం సమాజం వహించినది.

యీ దురభిప్రాయంతోనే స్త్రీ ఎంత శక్తిసామర్థ్యంతో పనిచేసినా తక్కువ కూలి నివ్వడానికే అంగీకరిస్తూంది సమాజం, ప్రభుత్వం చట్టప్రకారం కాకుండా ఎక్కువకాలం పని చేయించుకు కూడా యీ స్త్రీల కేవిధమైన సౌకర్యాలు లేక, వారి నవమానపరచడం, నిర్బంధించడము, ఇవి చాలక, వారిని సమాజం నిరంతర దోపిడీ చేస్తూంది.

సమానంగా పాటుపడే పాటకజాతిలోకూడా స్త్రీ పురుష భేధాన్ని పాటించి శ్రమలోకూడా స్త్రీలను అవమానపరచడం అన్యాయం, క్రూరం. యీ సోదరీ పాటకస్త్రీలకు యిటివంటి ద్రోహం జరుగుతూంటే. సమాజం మూకీభావం వహించింది.

యీ నిరంకుశాల్ని పూర్తిగా నాశనం చేశే స్త్రీ జాతి తమ హక్కుల్ని కాపాడుకోవాలి. యివన్నీ కండ్లఎదుట నృత్యం చేస్తూన్న, బూర్జువా జాతీయ మహిళాసంఘాలు వారి కేవిధమైన సహాయం చేయక, నిరసనభావం చూపిరి. యీ కృత్రిమ నియమాల్ని దగ్ధం చెయ్యాలని మహిళాసంఘాలు తీవ్రాందోళన చెయ్యాలి. స్త్రీజాతి సమాజంచేత వ్యక్తులచేత జిక్కి దోపిడీ అవుతూంది. యిప్పటికైనా యీ నిరంకుశ వర్ణభేదం నాశనం చేసి వారికికూడా మహిళా సంఘాలు స్థానమివ్వాలి.

ఒక్క ఫ్యాక్టరీ, వ్యవసాయకూలీ స్త్రీలే కాదు. యిళ్ళలో పనిచేసే కూలిస్త్రీల స్థితి కూడా ఇంతే. పురుషాహంకారాలతోటి, కృత్రిమ విధానాలతోటి కుళ్ళిపోతున్నా యీ దుష్ట సమాజంలో వారి కష్టాలు నిర్మూలమవుతా యనుకోడానికి ఎక్కడా దారి లేదు.

యీ నిరంకుశ నరకాల్ని తప్పించుకుని స్త్రీలుకూడా పురుషునితోపాటు సమానావకాశాలు, సమాన హక్కులూ పొందాలంటే, యీ హెచ్చు తగ్గు బానిస సమాజాన్ని నాశనం చెయ్యాలి.

నూతన సమాజాన్ని స్థాపించి తీరాలి. బూర్జువా సమాజంచేత శాసనం చేయబడ్డ, స్త్రీల నిరంకుశ శాసనం లెక్కచేయక, స్త్రీలుకూడా తప్పక రాజకీయంలో సమాన స్థానం వహించాలి.

భారత మహిళా సమాజాన్ని నడిపించే ఉన్నత వర్గపు స్త్రీలు. యీ పాటక స్త్రీలకు సహాయం చేయ మరచిరి, నిరసించిరి, అవమాన పరచిరి ...

పనిచేసి మల మల మాడే పీడితవర్గపు స్త్రీలు మొర పెట్టుకోడానికి, వారి కేవిధమైన హక్కులూ కాక బానిసలైరి. ఏ మహిళాసంఘము పోరాడినా వారి కుండవలసిన హక్కులు, చేసిన పనికి తగ్గ ప్రతిఫలం, విద్యా సౌకర్యాలు బిడ్డల శిక్షణా ప్రసవ సమయంలో జీతం మీద శలవు ఆరోగ్యాన్ని కాపాడే హాస్పిటల్లు కావాలనే సంగతి తెలుసుకోవాలి.

వారసత్వపు హక్కుల్ని వారికి బోధ చేస్తే, వారికి అర్థం కాదు. వారి కీవారసత్వపు హక్కులతో పని లేదు. యివి ఉన్నతవర్ణపు స్త్రీలు కోరేవి.

పాటుపడ్డమే తప్ప వారి కేవిధమైన ఆస్తులూ లేవు. వాళ్లు నా జమీందారి స్త్రీలకు సౌకర్యాలు చేస్తూన్న తరతరాలనుంచీ కూడా కూడూ, గుడ్డా లేక హీనులై ఉన్నారు. యీ విధంగా కొన్ని కోట్లమంది స్త్రీలు కష్టపడి సంపాదించిన సంపదల్ని ఏ కొద్దిమంది స్త్రీలో మాత్రమే వారిని ద్రోహం చేసి అనుభవిస్తూన్నారు. అవకతవక ఆర్థిక విధానంలో కూడిన నేటి సమాజంలో యీలాంటి హక్కుల్ని కోరటం, ఒక వర్గం ఎక్కువ మరొకవర్గం తక్కువా అయినప్పుడు, ఒకరికి మరొకరు ద్రోహం చేయడం. వారి నణచడానికి యీ బూర్జువా హక్కులు దారి తీస్తూన్నాయి.

ఏనాడైతే స్త్రీలంతాకలసి ఆర్థిక స్వాతంత్ర్యం యొక్క నిజస్వరూపాన్ని తెలుసుకుంటామో ఆనాడే స్త్రీ స్వాతంత్ర్యం ప్రత్యక్షమౌతుంది.

హిందూదేశపు స్త్రీలలో 100 కి 90 మంది పాటక వర్గానికి చెందిన స్త్రీలే కనుక భారత మహిళా ఉద్యమాలు వాటియొక్క తీవ్రతా, పోరాటశక్తి పాటకపు జాతి స్త్రీలమీదే ఆధారపడి ఉంది. స్త్రీలకు సంబంధించిన హక్కులన్నీ వాళ్ళకుకూడా కొద్దోగొప్పో చెందినవవుటచేత వీరిదే పోరాటశక్తి. యివన్నీ జ్ఞప్తియందుంచుకు పనిచేసే మహిళా సంఘం ఎక్కువగా వీళ్ళలో చైతన్యం కలుగచెయ్యాలి. యీ పాటక స్త్రీలలో వర్గచైతన్యం ఎంత ఎక్కువైతే అంత చురుకుగా పోరాడగలము,

యింతవరకూ బూర్జువా స్త్రీలలో నిండిన మహిళా మండలి ఒక్క ఉన్నత వర్గపు స్త్రీలకొరకై ప్రాముఖ్యత వహించాయి. ఆ బూర్జువా స్త్రీలెప్పుడూ సాంఘి

( మిగతా 14 వ పేజీలో )

# నవశక్తి

23—2—38 బుధవారము

## మంత్రుల రాజీనామా

భోగీ అయింది. కాంగ్రెసు మంత్రివర్గాలున్న యేడు రాష్ట్రాలలోను రెంటిలో మంత్రులు రాజీనామా నిచ్చారు మంచి ఒకటవ రకమైన సమస్యయిది. రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని ఆర్డరిచ్చారు. బీహారు యు. పి. రాష్ట్రాల ప్రధానమంత్రులు. బీహారులో వున్న రాజకీయ ఖైదీలు 23 గ్గురు. యు. పి. లో వున్నవారు 15 గురు. ఈ ఉత్తర్వు సామ్రాజ్య వాదులకు చాలా కంటకంగా కనపడింది. వైస్రాయి 126 (5) సెక్షను క్రింద (ఇండియా గవర్నమెంటు చట్టము) మంత్రుల ఆర్డర్లను రద్దు చేశారు. ప్రజా శాంతికి తీవ్ర భంగం వాటిల్లునని తోచినప్పుడు ప్రయోగించవలసిన సెక్షను అది. రాజకీయ ఖైదీల విడుదల ప్రమాదకరమని వైస్రాయిగారి అభిప్రాయము. యింకా యితర రాష్ట్రాలలో రాజకీయ ఖైదీ లున్నారు. వారి విడుదల ఉత్తర్వు యింకా కాంగ్రెసు మంత్రివర్గాలు వ్రాసను చేయలేదు. చేస్తే యిదే స్థితి ఆ రాష్ట్రాలలోకూడా ఏర్పడుతుంది. ఏడుమాసాల పరిపాలనా ఫలిత మిది.

ఈ రాజీనామాలయొక్క అంతరార్థం బాగా అర్థం కావాలంటే మంత్రిపదవీ స్వీకారం యెట్టి పరిస్థితులలో జరిగిందో తెలుసుకోవాలి. ఎన్నికలలో కాంగ్రెసు వాదులకు అఖండ విజయం కలిగినతర్వాత గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను ఉపయోగించమని హామీ యిస్తేనేగాని మంత్రిపదవులు స్వీకరించమని భీష్మించుకు కూర్చున్నారు. కాంగ్రెసుకు మెజారిటీ వచ్చిన అన్ని రాష్ట్రాలలోనూ నడిమంత్రపు మంత్రివర్గాల నాటకం నడిచింది. ఆ నాటకంవల్ల లాభం లేకపోయింది. ఎట్లైనా కాంగ్రెసు వాదులను మంత్రిపదవులలోనికి ఆకర్షించడానికి సామ్రాజ్య వాదులు తహతహ లాడేరు. ఎట్లో బెల్లించి బెల్లించి కాంగ్రెసు వాదులను ఒప్పించుకున్నారు. "మీరు కోరిన హామీ యివ్వడానికి చట్టంలో అవకాశము లేదు. కాని మీకు అవకాశ మున్నంత వరకు సంపూర్ణ సహకారం చేస్తామని" మాట యిచ్చేడు వైస్రాయి. అప్పుడు కాంగ్రెసు వర్కింగు కమిటీవారు మంత్రిపదవీ స్వీకారాన్ని అంగీకరించారు. "వైస్రాయి గారి స్టేటుమెంటులో మేము కోరిన హామీ మాత్రం లేదు. లేకపోయినా, గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను సులభంగా ఉపయోగించే స్థితిమాత్రం పోయిందని" వర్కింగుకమిటీవారు అభిప్రాయపడి పదవీస్వీకారాన్ని అంగీకరించారు. బ్రిటిషుగవర్నమెంటు ఒక విధంగా లొంగుబాటు కొచ్చిందని గ్రహించి మంత్రిపదవులను కాంగ్రెసు వాదులు పుచ్చుకోవాలని తీర్మానించారు.

ఆరు రాష్ట్రాలలో కాంగ్రెసు వాదులు మంత్రిపదవులు తీసికొన్నారు. తీసికోగానే తమ తమ రాష్ట్రాలలోనున్న రాజకీయ ఖైదీలనందరను విడుదల చేయాలను ఉత్తర్వు వ్రాసు చేసియుంటే యెంత బాగుండి యుండునో ఆలోచించుకోమని మహాజనులను కోరుచున్నాము. కాంగ్రెసు వర్కింగు కమిటీవారి అభిప్రాయప్రకారం అప్పుడు సామ్రాజ్య వాదులు తమ ప్రత్యేకాధికారాలను అంత తేలికగా ఉపయోగించగల స్థితిలో లేరు. అందుచే అప్పుడే రాజకీయ ఖైదీల సమస్యను యావద్భారత సమస్యగా చేసి అందరిని విడుదల చేసివేయవలసినది. అడ్డుపెట్టడానికి ధైర్య మప్పుడు లేదు సామ్రాజ్యవాదులకు. ఒకవేళ అడ్డుపెట్టియుండినచో అప్పుడే యీ రాజీనామా పరిస్థితులు యేర్పడియుండును. ఇస్తే వచ్చిన నష్ట మేమి?

కాని కాంగ్రెసు మంత్రులు, కాంగ్రెసు నాయకత్వము రాజ్యచక్రాన్ని మెల్లగా తాపీగా నడిపిద్దా మనుకున్నారు. రాజకీయ ఖైదీల విడుదలకొరకు సామ్రాజ్య వాదులతో రాజీ పద్ధతులు అవలంబించారు. అవలంబించి అనేకులను విడుదల చేశారు. కొందరు ఖైదీలను వార్నింగుతో విడుదల, కొందరకు వ్రాతమూలకమైన వాగ్దానాలతో విడుదల, యీ విధంగా ప్రతి రాజకీయ ఖైదీయొక్క రికార్డులను పరిశీలించి వ్యక్తిగత విషయంగా ఆలోచించి విడుదల చేశారు. కాంగ్రెసు అధికారానికి వచ్చినందున రాజకీయ ఖైదీల విడుదలను రాజకీయ విధానంగా (Political policy) పరిగణించక దాక్షిణ్యం (clemency) గా చూచి విడుదల చేశారు. పైగా హింస, అహింస అను తారతమ్యాన్ని చూపేవారు.

ఈ విధానంవల్ల దేశంలో ముఖ్యంగా తీవ్రవాదులలో చాల అలజడి కల్గింది. జైళ్ళలో మ్రగ్గుచున్న రాజకీయ ఖైదీలలో తీరని ఆశా భంగము, అసంతృప్తి కల్గింది. తామే యీ సమస్యను పరిష్కరించుకోవలసిన అవసరం కల్గిందని భావించి జైళ్ళలో నిరశనవ్రతం ఆరంభించారు. అందుచే దేశంలో తీవ్రమైన ఆందోళన చెలరేగడం, వర్కింగు కమిటీవారు గాంధీమహాత్ముడు యీ సమస్యను ఒకటవ రకమైన రాజకీయ విధానంగా స్వీకరించి వెంటనే కాంగ్రెసు రాష్ట్రాలలోని రాజకీయ ఖైదీలను విడుదల చేయవలెనని కాంగ్రెసు మంత్రులకు హుకుం జారీచేయడం జరిగింది. దానికి ఫలితమే బీహారు, యు. పి. రాజీనామాలు.

ఈ విషయమై పార్లమెంటులో యిండియా ప్రభుత్వ సహాయ కార్యదర్శి వింటర్టన్‌గారును ప్రస్తావించుచు, కాంగ్రెసు మంత్రు లిదివరలో దౌర్జన్య రాజకీయ నేరం చేసిన ప్రతి ఖైదీ విషయం వ్యక్తిగతంగా ఆ కేసుయొక్క మంచి చెడ్డలనుబట్టి నిర్ణయించి విడుదల చేయుటకు ఆర్డరిచ్చేవారనిన్ని అట్టి సందర్భాలలో గవర్నర్లు ఎప్పుడు ఆటంక పరుపలేదనిన్ని యిప్పుడు ఆపద్ధతిని వీడి అందరిని ఒక్కుమ్మడిగా వ్యక్తుల తారతమ్యాన్ని కేసులయొక్క మంచి చెడ్డలను ఆలోచించకుండానే విడుదల చేయుడని పట్టుపట్టుటచే ప్రత్యేకాధికారముల నుపయోగించ వలసివచ్చిందనిన్ని విశదీకరించినారు.

నిజము. మంచి మాటలచే బెల్లించి యుక్తిచే, చాకచక్యంచే యింతకాలం రాజకీయ ఖైదీలను విడుదల చేయించారు మన మంత్రులు. కాని యిప్పుడో: దేశంలో జరిగిన తీవ్ర ఆందోళనకు ఫలితంగా, రాజకీయ ఖైదీల విడుదలను కాంగ్రెసుయొక్క ప్రధాన రాజకీయ విధానంగా (Political policy) పరిగణించి అందరిని విడుదలచేసి తీరాలని పట్టుబట్టినారు. సామ్రాజ్య వాదుల దృష్టిలో నిది మూర్ఖపు పట్టు కావచ్చును. కాని కాంగ్రెసుయొక్క దృష్టిలో, దేశంయొక్క అభిప్రాయంలో నిది ప్రధాన రాజకీయ విధానము. క్షణమాత్రమున పిలుపు వచ్చినప్పుడు యిట్టి ఉత్తమ రాజకీయ సమస్యపై కాంగ్రెసు మంత్రులు పదవులను వదలన్ని వచ్చేసినందుకు హృదయపూర్వకముగా వారిని అభినందిస్తున్నాం.



# ★ వ్యాఖ్యలు ★

## హరిపుర కాంగ్రెస్

హరిపూర్ కాంగ్రెస్ అధ్యక్షులు సుభాస్ చంద్రబోసుగారు తమ అధ్యక్షోపన్యాసం ద్వారా దేశానికి చక్కని సందేశ మిచ్చారు.

యంత్ర యుగానికి పూర్వపు రోజులను పోవాలమని తెలియజేశారు. కాంగ్రెసులో తీవ్రవాదులపక్షం యొక్క ఆవశ్యకతను వెల్లడించారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ తీవ్రవాదుల అభిప్రాయాలను ప్రతిధ్వనింప జేయడానికి అవసరమని అంగీకరించారు. రైతు కార్మిక సంఘాల ప్రతినిధులతో కలసి సామ్రాజ్యప్రతికూలుర సంఘటన నిర్మించబడాలన్నారు. బ్రిటీష్ కమ్యూనిష్టుపార్టీ కాంగ్రెసు మహాసభకు సంపూర్ణ సానుభూతి చూపుతూందన్నారు.

స్వదేశీ సంస్థానాలలో నిరంకుశత్వానికి ఎదురుగా ప్రజలు జరుపుచున్న పోరాటానికి సానుభూతి చూపుతూ, ముందైనా కాంగ్రెసు యింతకంటే ఎక్కువ సహాయము సంస్థాన ప్రజల ఉద్యమానికి చేస్తుందని ఆశించారు. ఫెడరేషనును, రాజ్యాంగ చట్టాన్ని నిర్మూలించాలసిన ఆవశ్యకతను, పదవీస్వీకారంలోవున్న అపాయాలను వివరించారు.

సోషలిజమే ప్రజలకష్టాలను తొలగించ కలుగుతుందని నమ్మకం వెల్లడించారు. స్వాతంత్ర్య సంపాదనానంతరమే సోషలిస్టు నిర్మాణం సాధ్యమని తెలపి ప్రజలలో చైతన్యం కలుగ చేయడానికి సోషలిస్టుప్రచారం అవసరమన్నారు. అధ్యక్షోపన్యాసం ఆశ లూరించుతూంది. ఈవిశాల ఆశయాలను ఆచరణయందుంచుటలో మన స్వాతంత్ర్య పోరాటగమనం ఆధారపడి వుంటుంది.

## సంస్థానప్రజలతీర్మానం

అఖిల భారతవర్కింగుకమిటీ తెచ్చిన తీర్మానములలోనికెల్లసంస్థానాలలో కాంగ్రెసుకమిటీలగురించినతీర్మానంచాలసంకుచితముగావున్నది. సంస్థానప్రజల యిబ్బందులు అందరూ గుర్తించారు. కాని కాంగ్రెసు ప్రతిష్టకంటువడునట, అందుచే కాంగ్రెసు సంఘాలు అచట వుండరాదట. కాంగ్రెసు ప్రతిష్ట ప్రజల యిబ్బందులకై పోరాడుటలోనే వుంది. ప్రభుత్వోద్యోగులచే కాంగ్రెసువాదులు హింసింపబడినపుడు, కాంగ్రెసు గౌరవం పెరిగినదనే సంగతి మనం మరువరాదు. అటులే నేడు సామాన్య పౌరసత్వహక్కులు లేని సంస్థానాలలోని ప్రజల తరఫునిలబడిన కాంగ్రెస్ గౌరవం హెచ్చును. అది పీడిత ప్రజల ఛాంపియన్‌గా పరిగణింపబడును.

సంస్థాన ప్రజల కాన్ఫరెన్సు అధ్యక్షులు పట్టాభి సీతారామయ్యగారు రాజీసూచనలతో చేసిన తీర్మానంలో సైతం పసలేదు. కాంగ్రెసు కమిటీ లుండవచ్చునట. కాని వానిచే ప్రత్యక్ష పోరాటంగాని, శాసనసభా పోరాటంగాని సంస్థానాలలో జరుపబడరాదట. అయితే ఇంకేమిటో సంస్థానాలలోని కాంగ్రెస్ కమిటీలు చేసేది! చేయగలిగినది! అంటే ప్రభువులకు పిటీషన్లు పంపుకొనుటతప్ప, తమ కెన్ని యిబ్బందులున్నా, యింకేమియని కాంగ్రెస్ పేరట చేయరాదనియేగదా!

కాంగ్రెస్ మహాసభ ఫెడరేషను నాశనం గావించాలనే ఆశయానికి ఈ తీర్మానం యెంతేని అడ్డు. ఫెడరేషనువలన నష్టపడేది, బ్రిటిషు యిండియా ప్రజాసామాన్యం, సంస్థానాలలోని ప్రజలు. లాభంపొందునది. బ్రిటీషు సామ్రాజ్యవాదులు, మహారాజులు, నవాబులు. ఫెడరేషను భగ్నంచేయ తలపెట్టిన కాంగ్రెసు ఫెడరేషనులో నష్టపడనున్న ప్రజలందరిని కూడగట్టుకొని అఖిలభారతదృష్టితోనే పోరాటం సాగించాలి. అట్టిచో కాంగ్రెసు సంస్థానప్రజల పోరాటంతో సంబంధం అంటుకొంటుందేమోనను భయమెందులకు? సంస్థానాధిపతులకు వెరచియా? వారిసాయంతో ఫెడరేషను ఎదుర్కొందామనే భ్రమవలన?

## చీరాల కాల్పులు.

చీరాల పొగాకు ఫ్యాక్టరీలో పనిచేయుచున్న కార్మికులు సమ్మెచేయుట, సమ్మెదారులపై పోలీసులు తుపాకులు పేల్చుటచే ముగ్గురు చనిపోవుట, అనేకమంది గాయపడుట జరిగింది. శాసన సభాసభ్యులు అచటికి వెళ్ళి విచారించి కాల్పులు అక్రమముగా జరిగినవని ప్రకటించిరి. తరువాత కొంతకాలమునకు అధికారులు తమ చెయిదముల సమర్థించుకొనుటకు గాబోలు ఒకప్రకటన గావించారు.

గిరిగారు అక్రిందటి దినం అచటికివచ్చి వెళ్లినపుడు సమ్మెసక్రమంగా శాంతంగా జరుగుచుండెను. మరునాడుదయానికి రిజర్వు అచటికి తెప్పించాలసిన అవసరం, కాల్పుల ఆవశ్యకత ఎందులకు కల్గినదో!

చచ్చినవాళ్ళు పోగా, గాయపడినవాళ్ళు బాధపడుచుండగా తరువాత సమ్మెరాజీ జరిగినదని వార్తలు వస్తున్నవి. సమ్మెకు పూర్వం పనిలో వున్న వారందరిని చేర్చుకొంటారట కాని కూలీ హెచ్చుచేయుట, బోనసు, యూనియన్ అంగీకరించుట వగైరా ముఖ్యమైనవి విచారణ సంఘానికి వదలివేస్తారు. ఈరాజీ, కలెక్టరుగారితో సహా [illegible] నాయుడుగారు [illegible] ముఖ్యమైనగా నుంటున్నారు. కార్మికు సమిష్టిగా తమ హక్కుల రక్షించు కొనుట కేర్పడిన యూనియనును అంగీకరించుట కార్మికులకు చాలముఖ్యమైనది. ఆసంగతి గుర్తించనివారు కార్మికుల శ్రేయోభిలాషులు కాజాలరు.

ఈ కాల్పుల వలన మరణించిన కార్మికుల కుటుంబాలకు నష్టపరిహారం యజమానుల ఖర్చుపై యిప్పించవలెను. కాంగ్రెస్ మంత్రులు కాల్పులకు కారకులైన అధికారులపై చర్య తీసికొని ఇకముందు 'లా' ఆర్డరుల పేరుతో ప్రజల ప్రాణాలు బలిగొను అవకాశం లేకుండా చేయుట ధర్మం.

### చందాదారులకు మనవి

చందాదారులు తమ చందా ధనమును వెంటనే మనియార్డరు చేయప్రార్థన. లేనిచో వి. పి. లు పంపబడును. మనియార్డరు ద్వారా పంపిన వారికి పోస్టేజి కలసి వచ్చును.

రాజమండ్రి. — మేనేజరు
23.1.38 — నవశక్తి

# బాబూ సుభాష్ చంద్రబోస్ గారి అధ్యక్షోపన్యాస సంగ్రహము

సోదరులారా !

జాతీయ మహాసభకు అధ్యక్షునిగా ఎన్నుకొని గౌర వించినందులకు కృతజ్ఞుడను.

★

ముందు విషయాలను ప్రస్తావించే పూర్వం గత కాంగ్రెస్ సమావేశం మొదలు దేశసేవార్థమై కారాగారముల కేగి, ప్రాణముల గోల్పోయినవారిని సంస్మరించి ప్రణామం చేస్తున్నాను. స్వరూపరాణి, జగదీశ బోస్, శరశ్చంద్ర చటర్జీ, హరీంద్రనాథమున్షీ మొదలగు దేశభక్తుల, సాహిత్యవేత్తల, శాస్త్రజ్ఞుల కోల్పోయాం. హరీంద్రను స్మరించినపుడు హృదయం దద్దరిల్లుచున్నది.

★

ప్రపంచ సామ్రాజ్యాలను అవలోకించితే ఒక ముఖ్యవిషయం గోచరిస్తుంది. పూర్వ సామ్రాజ్యాల విజృంభణం—వినాశము. ప్రాచ్య పశ్చిమ ఖండాల్లో అనేక సామ్రాజ్యాలు విజృంభించి మహదైశ్వర్యం పొంది ఉచ్చదశ ననుభవించాయి. పిమ్మట కొన్ని కృంగి నశించాయి కూడా. బ్రిటిష్ సామ్రాజ్యానికి మాత్రం మరో జాతకం వ్రాయడానికి ఎవరు సాహసించుతారు? బ్రిటిష్ సామ్రాజ్యం పూర్వపు సామ్రాజ్యాలనైనా అనుసరించాలి. లేదా స్వపరిపాలిత దేశాల సమాఖ్యగా మార్పుచెంది రూపాంతరమైనా పొందాలి. రష్యాలో 1917 లో జారుల నిరంకుశత్వం అంతమయింది. ఆ శిథిలములనుంచి సోవియట్ రిపబ్లిక్ అనే సాంఘిక సమత్వం ఉన్న ప్రజా ప్రభుత్వం ఏర్పడింది. రష్యానుంచి బ్రిటన్ చాలా కొత్త విషయాలు నేర్చుకోదగినవి ఉన్నవి. వాటిని బ్రిటన్ గ్రహించుతుందా ?




★

బ్రిటిష్ సామ్రాజ్యంలో స్వపరిపాలిత దేశాలు, సంపూర్ణంగా స్వరాజ్యం లేని దేశాలు, నిరంకుశంగా పాలింపబడే వలసరాజ్యాలు ఉన్నాయి. ఈ అతుకుల బొంత సామ్రాజ్యం ఎపుడో శిథిలం కాక తప్పదు. కాని బ్రిటిష్‌వారే సాహసించి, తమ సామ్రాజ్యంలోని దేశా లన్నిటికి స్వరాజ్యం ఇచ్చి, సామ్రాజ్యాన్ని 'స్వపరిపాలిత రాజ్య సమాఖ్యగా గొప్ప మార్పు చేస్తారా? దీనికి బ్రిటిష్ ప్రజలే సమాధానం చెప్పాలి. బ్రిటన్‌లో పెద్ద పెట్టుబడిదార్లకూ—షావుకార్లకూ వలస రాజ్యాలకీ సంబంధం ఉంది. లెనిన్ మహాశయుడు చెప్పినట్లు, "పెక్కు జాతుల దాసత్వం వల్లనే ఇంగ్లండులో ప్రజాశయ ప్రతికూలుర బలం హెచ్చుతున్నది." వలస రాజ్యాలవారిని పీడించి,హింసించి, ఇంగ్లండులోని సామంతుల ప్రభువులు జీవించుతున్నారు. కాబట్టి అలాంటి సమాఖ్య రావాలంటే బ్రిటన్‌లో సామ్యవాద సూత్రాలు అనుసరించి స్వదేశంలో సంపూర్ణ ఆర్థిక స్వాతంత్ర్యం ప్రజలకు ప్రసాదించాలి. కాని బ్రిటన్‌లో వలసరాజ్య కాంక్ష ఉంటే సామ్యవాదం నెలకొల్పలేరు. ఇతర రాజ్యాలవారికి విముక్తి ఇయ్యాలన్నా మనమే పోరాడాలి.

★

బ్రిటిష్‌వారి నీతి మిత్రభేదం. ఇంత కట్టుదిట్టంగా నిర్దాక్షిణ్యంగా మరే రాజనీతి లేదు. ఐర్లండు పాలస్తైన్—ఈజెప్టులలో ఇదే నీతి. మన దేశంలో కూడ మరో రూపంతో ఇదే నీతి. ఫెడరేషన్ తెచ్చి ప్రజలకు నిరంకుశ ప్రభువులకు ముడిపెట్టుతున్నారు. అంర్జాతీయ పరిస్థితులలో బ్రిటన్ ఏదేశంలో ఏపక్షాన్ని అభిమానించాలో అని గడబిడ పొందుతున్నది. మన పీడిత దేశీయు లందరూ కలిసి మనలో మనం మంచితనంగాఉంటే, రవియస్తమింపని బ్రిటిష్‌సామ్రాజ్యం శిథిలమై ఏదో విధంగా సమాధాన పడతారు. నేడు సామ్రాజ్యవాదమనే చెట్టు యొక్క కూకటివేళ్లు బయటపడ్డాయి. ఇది త్వరలోనే కూలిపోతుంది.

మనదేశంలో బ్రిటిష్ఇండియా ప్రజలకు, సంస్థాన ప్రజలకు కృత్రిమభేదం కల్పించబడింది. కాని మన అందరి ఆశయం సంపూర్ణ స్వాతంత్ర్యం. అది అఖిల భారత ప్రజాస్వామ్య సమాఖ్యగా ఏర్పడాలి. సంస్థాన ప్రజల ఆందోళనలు ఇపుడింతకంటె తొందరపడే పోయినా మున్ముందు అవకాశం లభించుతుందని నమ్మకం.

★

భారతదేశానికి స్వతంత్రం లభిస్తే మహమ్మదీయులు భయపడ నవసరంలేదు. 17 సం॥ రాలనుండి కాంగ్రెస్ సాంఘిక ప్రతిపత్తిలోని ప్రతిబంధకాల తొలగించడానికి ప్రయత్నిస్తునే ఉంది. అచిరకాలంలోనే నిమ్నజాతులకు ఈప్రతిబంధకాలు కలలోని వార్తలులాగా ఉంటాయి.

జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో మనం అవలంబించవలసినది చౌర్యరహిత సత్యాగ్రహం. మంత్రిపదవులు పుచ్చుకొన్నందువల్ల రాజ్యాంగచట్టానికి బద్ధులమయి ఉండాలనికాదు. ఫెడరేషను అంటగట్టితే ధిక్కరించడానికి దేశమంతా శాసనోల్లంఘనం బాహాటంగా ఉపక్రమించాలి. స్వాతంత్ర్య పోరాటాన్ని సాగిస్తూ ఈమధ్యవచ్చే స్వల్పాధికారాలను స్వీకరింపవచ్చు లేక నిరాకరింపవచ్చు. బ్రిటిష్‌వారితో సంపూర్ణంగా విడగొట్టుకొన్న తర్వాత, బ్రిటన్‌తో ఎలాంటిసంబంధం ఉండాలో అపుడు ఆలోచించుదాము. ఈవిషయంలో డివెలెరా నాకు నచ్చాడు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకూడ మన కాంగ్రెసు పార్టీయే పునర్నిర్మాణం చేయాలి. స్వాతంత్ర్యం వచ్చాక కాంగ్రెస్‌పార్టీ నశించదు. అదే పరిపాలించుతుంది, కాని ఇతరపార్టీలను నిషేధించవలసిన అవసరంలేదు. కాంగ్రెస్ నియంతృత్వంగాక ప్రజాస్వామ్య పద్ధతే అవలంబించుతుంది.

★

దేశ పునర్నిర్మాణాన్ని గురించి ఇపుడే ఆలోచించుటకు కాలం పరిపక్వం కాకపోయినా మన సంకల్పం యోచింపవచ్చును. దారిద్ర్య నిర్మూలనం, విద్యావ్యాప్తి, శాస్త్రపద్ధతుల ననుసరించి ఉత్పత్తి మొదలగునవన్నీ సామ్యవాద సూత్రాలపైననే నెరవేరాలి. రాష్ట్రీయ జాతీయప్రభుత్వం రెండు కమిటీలు నియమించాలి. ఒకటి అప్పటికప్పుడు చేయవగిన పనుల గురించి, రెండవది దీర్ఘకాలంలో చేయవగిన పనులు. అవి వెంటనే చేయవలసిన పనులు (1) సైనికుల్ని కట్టుదిట్టం చేయడం (2) భారతజాతీనం ... చేయడం (3) వివిధ ప్రాంత ప్రజలకు ... వికాసంచే కూర్చడం. ఒక్కకేంద్ర ప్రభుత్వం ... లోబడి వేర్వేరు అల్పసంఖ్యాక సంఘాలకు, ... సంపూర్ణ స్వాతంత్ర్యాలను ఇచ్చి, ... అభయం ఈయాలి. విదేశ ప్రభుత్వం ... ర్యులూ-కట్టుబాటు లేనివారూ ...

★

దేశానికంతటి సామాన్యలిపి, ... కావాలి. విమానాలు, టెలిఫోనులు, రేడియోలు, ..., టెలివిజనులు మొదలగు ... వివిధ ప్రాంతాలకు సన్నిహిత సంబంధం కలుగచేయాలి. హిందీ ఉర్దూల సమ్మేళనం ... రోమను లిపి (ఇంగ్లీషువర్ణమాల) మనం ఉపయోగించాలంటే మీరందరు నివ్వెరపోతారు. కాని కేవలం సశాస్త్రీయమైన హేతువాదాలతోను, చారిత్రక పరిజ్ఞానంతోను నాసలహా విమర్శింప గోరుతాను. పూర్వపు అభిప్రాయాలను 1931 లో టర్కీ వెళ్ళిన తరువాత మార్చుకొని ఇతర ... పాటు వారి లిపినే వాడితే కలిగే లాభాలను గ్రహించాను.

★

మనము అన్నవస్త్రములిచ్చి చదువు సంధ్యలునేర్పి పోషింపగలిగినంతవరకే ప్రజాభివృద్ధి కోరవలెను. అందుచే జన్మ నిగ్రహమును గూర్చి ప్రజలందరాలోచించాలి.

★

జాతీయ పునర్నిర్మాణంలో దారిద్ర్యం తొలగించాలి. భూస్వామ్యపద్ధతి మార్చు చేయాలి. జమీందారీ పద్ధతికూడా మార్చివేయాలి. స్వల్పవడ్డీతో సహకార సంఘాలు విస్తరింపచేయాలి. సశాస్త్రీయమైన పద్ధతులలో వ్యవసాయం సాగించాలి. ఆర్థికదైన్యం తొలగించడానికి వ్యవసాయం చాలదు. పరిశ్రమలు కావాలి. అవి ప్రభుత్వఆధీనంలో ఉండాలి, విస్తారోత్పత్తిని ప్రోత్సహించాలి. యంత్రాగారాల వ్యాపారపద్ధతుల్ని ఎవగించుకొన్నా యంత్రాగారమునకు దానికి పూర్వం ఉండిన ప్రాతపద్ధతులకు పోలేము, కాబట్టి మన మనస్సులు త్రిప్పుకోవాలి. యంత్రాగార పరిశ్రమలోని దోషాల్ని పోగొట్టచూడాలి గాని యంత్రపరిశ్రమలను బహిష్కరించరాదు. వ్యవసాయాన్ని పరిశ్రమలను, సమిష్టిసహకార పద్ధతులపైన కట్టుదిట్టం చేయాలి.



అచ్యుత పట్వర్ధన్

గత సంవత్సరపు సోషలిస్టు వర్కింగ్ కమిటీ సభ్యుడు.



విజయలక్ష్మి పండిట్

... రాజీనామా ఇచ్చి, మంత్రులలోని ...



అబుల్‌కలాం అజాద్

స్వదేశ సంస్థానాల తీర్మానం ఉపపాదించాడు



వల్లభభాయి పటేల్

... సోషలిస్టు ... సహించడు.



యం. యన్. రాయ్

రైతుసంఘాలు వద్దంటూ ఒకే ఒక చేయినెత్తాడు.

★

మంత్రిపదవీ స్వీకారంకూడదని నేనూ వాదించాను. కాని అది మహాపాతకం అని నేను అనడంలేదు దానివల్ల లాభప్రయోజనాలను లేదని వాదించను. ఇదివరకు పదవీస్వీకారంవల్ల లాభంకంటె నష్టం యెక్కువ వుందని తలచాను. కాని ఆ ఊహ నిరాధారం. అయినా అపాయాలు లేకపోలేదు.

★

మన మంత్రులు అధికారంలో ఉండగా కాంగ్రెస్ బలం వృద్ధిచేయడం ఎలాగు? మంత్రివర్గములు మారినా, వ్యవహార శాఖలకుచెందిన అధికారవర్గం మాత్రం సుస్థిరంగా సాగుతునే ఉంటుంది. కాబట్టి అది మారనిదే, దానితత్వం మారనిదే లాభంలేదు. జర్మనీలో యుద్ధానంతరం సోషల్‌డెమాక్రటిక్ పార్టీకి, 1924–29 లలో ఇంగ్లండులోని కార్మికపక్షాలకు పట్టినగతి ఏమిటి? మంత్రివర్గాల అభిప్రాయాల్ని కొనసాగించలేక పోయారు.

సివిల్‌సర్వీస్ సిబ్బంది బ్రిటిష్‌వారిచే కల్పింపబడింది. వారి ధోరణికి మనజాతీయ ధోరణికి వ్యత్యాసం ఉంది. కాంగ్రెస్ పదవిలోనుండగా, విద్యాభివృద్ధి, ప్రజారోగ్యం, మద్యనిషేధం, చెరసాల సంస్కరణం, వ్యవసాయ జలాధారాలు, భూముల హక్కుభుక్తములు కార్మిక జనులకు లాభాలు అనేక కార్యావిధానాలు ఆలోచించాలి. ఈనాటి వర్కింగుకమిటీ మున్ముందు భారత స్వరాజ్యమును పాలించేదిగా మారాలని నాఅభిప్రాయం. నేను జీవించి యుండగానే స్వరాజ్యం చూడాలని ఉవ్విళ్ళూరుచున్నాను.

★

ఫెడరేషన్ విధానమును ప్రతిఘటింపగల్గిన సామర్థ్యాన్నిబట్టియే మనరాజకీయ భవిష్య దభ్యుదయము ఉంటుంది. దీనిని ప్రతిఘటించడానికి శాసనబద్ధ కార్యమే అవలంబించ నవసరంలేదు. జనబాహుళ్య శాసనోల్లంఘనం కూడ సాగింపవచ్చు. అదే మన కడపటి సాధన ప్రయోగము. అట్టి ఉద్యమమే ప్రారంభమయిన ఒక బ్రిటిష్ఇండియాలోనేగాక సంస్థానప్రజలలోకూడ విస్తరింపగలదు.

కాంగ్రెస్ పార్టీని కట్టుదిట్టం చేయాలి, శిక్షణ తర్ఫీదుపొందిన సేవాదళాలు గావాలి, దేశసేవ సాగించడానికి ఉద్యోగిబృందం కావాలి, రాజకీయ పక్షానికి ఉండవలసిన ఈఏర్పాట్లు మనకి లేవు, ఇంగ్లాండులోని రాజకీయ ... పాఠశాలలు, తదితర సంస్థలు ... ఇస్తున్నాయి, కాంగ్రెస్ సేవకుల ప్రతిభాసామర్థ్యాల పెంపొందించే అవకాశం ఉంది.

★

మన కాంగ్రెసుపార్టీయొక్క క్రమశిక్షణమును గురించి ప్రస్తావించుచున్న ఈసందర్భములో మరొక విషయమును చెప్పవలసియున్నది. మనకు కొంత కలవరమును, ఆందోళనమును కలుగజేయుచున్న ... మున్నది. కార్మికసంఘ మహాసభ ... సభదో ఏది ... ఉన్నవి. ఈవిషయములో రెండుమతములవారు కలరు, కాంగ్రెసు మహాసభకు అతీతమైన ఇతర సంఘముల నన్నింటిని గర్హింపవలెనువారు కొందరు కలరు. తదితర సభలను సంఘములనుగూడ హర్షింపవలెనువారు మరికొందరు గలరు. ఈకార్మిక సంఘములును, కర్షక సంఘములును దేశములో ఇప్పుడు స్థిరముగా ఏర్పడియున్నవి. వానినిప్పుడు రద్దుచేయుటకు వీలులేదు. అట్టి సంఘము లేర్పడుటకు చరిత్రాధారము లైన కాలధర్మ



"మీరు ఖద్దరు కట్టకపోవడం వల్లనే మన మంత్రులు రాజీనామా ఇవ్వవలసి వచ్చింది"

# సుభాస్ అధ్యక్షోపన్యాసం

( ౧౦-వ పేజీ తరువాయి )

నులే కారణములు. అటువంటి సంఘములు విదేశములలో గూడ వెలసియున్నవి. మన కిష్టమైనను అయిష్టమైనను అసంఘములకు మనము సుముఖులము కావలెను. అయితే ఈసంఘముల యెడల కాంగ్రెసు ఏవిధముగా ప్రవర్తింప వలెనను విషయమును మన మిప్పుడు ఆలోచింపవలసి యున్నది. కాంగ్రెసు

సి. సుందరయ్య



“ యుద్ధం వస్తే అన్ని విధాలా సహాయ్యుల చేయించుదాం ”

అన్న ప్రవరణ ఉపసంహరించుకొన్నారు.

మహాసభ ప్రజాసామాన్యము యొక్క పలుకుబడికిని, అధికార ప్రాబల్యముకొరకును పోరాడుచున్నది. అట్టి కాంగ్రెసు మహాసభకు పోటీగా యీకర్షక కార్మిక సంఘములు పనిచేయరాదు. ఈసంఘములు కాంగ్రెసుతో కలసిమెలసి కాంగ్రెసుయొక్క లక్ష్యమును సాధన విధానములను అవలంబింపవలెను. అట్టి సహకారభావము చేకూరుటకై కాంగ్రెసు సేవకులు అధిక సంఖ్యాకులుగా కార్మిక కర్షక సంఘములలోచేరి పని చేయుచుండవలెను. సంఘర్షణమునకుగాని అసంగత చర్యలకుగాని దిగవలసిన అగత్యములేకుండ కాంగ్రెసువాదులు కార్మికసంఘములలోచేరి పనిచేయవచ్చునని నా అనుభవమువలన చెప్పగల్గుచున్నాను. ఈసంఘములు కార్మికకర్షకులకు సంబంధించిన ఆర్థికబాధకములను తొలగించుటకే కృషిచేయును. దేశస్వాతంత్ర్యమునకై కృషిచేయువారి కందరికిని సమానసమావేశరంగమైన కాంగ్రెసుసభలో కార్మిక కర్షక సంఘములు చేరి కాంగ్రెసుకు తోడ్పడవలెను.

★

కార్మికసంఘములను, కర్షకసంఘములను కాంగ్రెసుకు ఏవిధముగా అనుబంధింపవలెనను పెద్ద సమస్యను మనమిప్పుడు పరిష్కరింపవలసియున్నది. కొంత కాలమైనపిమ్మట, యీవిధముగా కాంగ్రెసులో చేర్చుకొనవలసిన సంఘములు యివి మాత్రమేగాక, సామ్రాజ్యవాద ప్రతికూలమైన దేశాభ్యుదయదాయకమైన సంఘముల నన్నింటినిగూడ కాంగ్రెసు మహాసభకు అనుబంధింపవలసిన అగత్యము కలుగును. అయితే, ఏ రీతినా వానిని అనుబంధింపవలసియుండును? అనుబంధింపబడవలసిన సంఘములయొక్క సుస్థిరత్వ మెంత పరిమితపవలెను? అను విషయములలో అభిప్రాయ భేదములు కలుగుచుండగలవు. రష్యాలో జరిగిన విప్లవమునందు కార్మికులు, కర్షకులు, సైనికులు వీరందరి యొక్క సమష్టిబలమే ప్రాధాన్యము వహించి పనిచేసి యుండెను. కాని, ఇంగ్లండులోనున్న కార్మిక మహాసభ దేశములోని కార్మికపక్షాధికార వర్గమునందు తగు మాత్రమైన ప్రాబల్యమునే వహించుచున్నది. కాంగ్రెసు మహాసభలోనికి కార్మిక కర్షక సంఘములు చేర్చుకొని ప్రాతినిధ్యము నొసంగినయెడల కార్మిక కర్షక బృందము తమకు సంబంధించిన ఆర్థికబాధకములు ముందుగా తొలగింపబడవలెనని భీష్మించి యుండరేగాని, యావద్భారతభూమికి సంబంధించిన విశాలమైన అమూలాగ్రమైన సంస్కరణముల విషయమై వారు ఆలోచింపవని వాదించుటకు అవకాశమున్నది. ఆవిషయమును మరువజాలము. ఈసంఘములను ఒక్కుమ్మడిగా కాంగ్రెసుతో చేర్చుట యెట్లను ప్రశ్న సంగతి యటుంచి, అఖిలభారత జాతీయమహాసభ యైన కాంగ్రెసుకును, ఇతరసామ్రాజ్యవాద ప్రతికూల సంఘములను, సన్నిహిత సాహచర్య మేర్పడవలెను. అట్టి సన్నిహిత సాహచర్య మేర్పడుటకు, యీసామ్రాజ్యవాద ప్రతికూల సంఘము లన్నియును కాంగ్రెసు మహాసభయొక్క సిద్ధాంతములను సాధన విధానములను అవలంబింపవలెను.

★

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యను నొక పార్టీని కాంగ్రెసు మహాసభలోనే ఏర్పాటుచేయుట ఎంతవరకు యుక్తముగానుండునను విషయమును గూర్చి చాల రగడ జరుగుచున్నది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తరపున నేను వకాల్తనామా తీసికొని మాట్లాడుట లేదు. నేను ఆ పార్టీలో చేరిన సభ్యుడను కాను. ఆ పార్టీలో నేను చేరియుండనప్పటికిని ఆపార్టీయొక్క మూల సిద్ధాంతములను, వ్యవహార పద్ధతులను మొదటినుండియు నేను ఆమోదించుచునే యున్నాను. ఈ తీవ్రవాదు లందరును ముమ్మొంమిగా తమ పార్టీని తాము కట్టుదిట్టము చేసికొనవలెను. ఈ పార్టీ వారు సామ్యవాదులత్వమును కలవారై యున్నయెడల వీరు ప్రత్యేక మొక ప్రతినిధివర్గముగా కాంగ్రెసు మహాసభలో ఏర్పడవచ్చును. అట్టి ప్రతినిధివర్గము నొక ప్రత్యేకపక్షముగా పరిగణించుటకు నామిత్రులు కొందరు ఆక్షేపింపగలరు. కాని, ఆ ప్రతినిధివర్గము నొక ప్రత్యేక బృందమని పిలిచినను, ప్రత్యేకశాఖ యని పిలిచినను వర్గమని పిలిచినను అట్టి నామకరణములో ప్రమాద మేమియును లేదు. కాంగ్రెసు మహాసభయొక్క అంగనిర్మాణములో సామ్యవాద సూత్రముల ననుసరించిన సంస్కార విధానము అభిలషించు ప్రతినిధివర్గ మొకటి ప్రత్యేకముగా నుండుటకు అవకాశము కలదు. కాని, కాంగ్రెసు మహాసభలో చేరిన సోషలిస్టు పార్టీ కేవలము ప్రతివాద పక్షముగా నుండవలెను. సామ్యవాద సూత్రములను వెంటనే దేశములో వర్తింపజేయుట కిప్పుడు సద్యః మనకు అవకాశములు లేవు. కాని, మనదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించిన పిమ్మటనైనను సామ్యవాద పద్ధతులను వర్తింపజేయుట కొరకై ఇప్పటినుండియు ప్రజలలో ఆ భావములను విరివిగా ప్రచారము సాగుచుండుటకై కాంగ్రెసు మహాసభలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యొకటి ఏర్పడి యుండవలెను.

★

ప్రతి దేశంలోనూ మన పోరాటానికి సానుభూతి చూపించేవారు అనేకు లున్నారు. తమ రాజకీయాభిప్రాయాలు ఏవియైనా, మనకు మాత్రం సానుభూతి చూపుతారు. ఈవిషయంలో సోవియటు రాజనీతిని మనం అవలంబించాలి. సోవియటు రష్యా, కమ్యూనిస్టు ప్రభుత్వం [illegible], సోషలిస్టు ప్రభుత్వం లేని దేశాలతో [illegible] యుండటము, ఏవైపునుంచి సానుభూతి వచ్చినా అంగీకరించుతున్నారు. కాబట్టి విదేశ పత్రికలలోను, చలన చిత్రాలద్వారాను, చిత్రకళా ప్రదర్శనాలద్వారా మనం విదేశాలలో ప్రచారం చేయాలి. విదేశాలలోని భారత విద్యార్థులకు మన

అన్నా[illegible] కామేశ్వరరావు



“ గ్రామ [illegible]లో [illegible] వస్తు గ్రామాలలోని పేదలకు సహాయ్యం ”

అన్న [illegible] పనిపోయింది.

సహాయము [illegible] ప్రయత్నించినచో మనం వారి సహాయం పొందగలం. ప్రతి దేశంలో మన ప్రయత్నాలు అహ్వానించే [illegible] ం ము లో కూడ ఉన్నారు. [illegible] బడి కలవారు. వారు ముఖ్యంగా [illegible] ర్థులు. ఐరోపా ఖండ మంతా [illegible]. మన మనాగరకులమని [illegible] న్నది.దాని నరికట్టి మన విజ్ఞానం ఎలా[illegible] తెలియజేయాలి.

ఇతర దేశాలలో [illegible] గురించి మనం ఆలోచించాలి. ఇదివ[illegible] ఎక్కువ శ్రద్ధ కాంగ్రెస్ తీసుకోవాలి. [illegible]త్ర్యం లేకపోవడం వల్ల ఇంతకం[illegible] పోతున్నాం. మనకు స్వాతంత్ర్యం [illegible]గా సహాయం చేయగలం. మన [illegible] రాజ్యాలతో కూడ సన్నిహిత సంబం[illegible].

★

మిత్రులారా! ఇంకొక్క [illegible] ముగింతును. నేడు మన మొక మహా [illegible] నెదుర్కొనుచున్నాము. కాంగ్రెసులోపల [illegible] తీవ్రవాదపక్షములకువిభేదములు [illegible]. ఈవి[illegible] మనము గమనింపకుండజాలము. వెలుప[illegible] సామ్రాజ్య తత్వము నెదుర్కొని పోరాడవల[illegible] యేర్పడి యున్నది. ఈవిషమ సంఘటనలో మన మేమి చేయదగును? మనల నెదుర్కొను [illegible] వన్నిటిని ఐకమత్యముతో నెదుర్కొనవల[illegible] వేరుగా చెప్ప [illegible] మన [illegible] అన్ని పన్నాగముల నన్నిటిని యెదుర్కొని వా[illegible] వ్యూహమును ఛేదింపవలెనని వేరుగా చెప్ప [illegible] నేడు భారత జన సామాన్యము [illegible] ఏహాంయ పోరాడు గొప్ప ప్రతిష్ఠాపనము [illegible] భారత జాతీయ మహాసభమాత్రమే. భారతదేశ [illegible] విముక్తికై

(మిగతా 15 వ పేజీలో)



# సకల బాధ నివారణకు సామ్యవాదమే శరణ్యము



## జవహర్‌లాల్ ప్రత్యేక నివేదిక

### తీవ్రవాదులు లేనిచో కాంగ్రెస్ కేవలం మితవాదంగా మారిపోతుంది



పదవీ భారాన్ని సుభాస్‌కు అప్పగించుతూ, జవహరులాల్ ఒక ప్రత్యేక నివేదిక ప్రకటించారు. ఇలా అధ్యక్షుడు నివేదిక ప్రకటించడం ఆచారం లేదు ఇదివరకు. ఆ నివేదికలోని కొన్ని భాగా లివి.

★

ఫాసిజం మనకు సరిపడదు. ఫాసిస్టు అక్రమణను మనం ఖండించాం. ప్రపంచ సంగ్రామం వస్తే ప్రజాస్వామ్యాన్ని అంటిపెట్టుకొని పోరాడే దేశా లేవి? ఇంగ్లండా? ఇంటివద్ద బ్రిటన్ ప్రజాస్వామ్య ప్రభుత్వమైనా విదేశ రాజనీతిలో అది సామ్రాజ్యవాద వైఖరి అవలంబించుతున్నది. ఒకవేళ బ్రిటన్ ఫేసిజానికి వ్యతిరేకంగా పోరాడినా ప్రపంచ యుద్ధంలో సహకారం చేయం. అది నిజమైన ప్రజాస్వామ్య ప్రభుత్వం అయితే ఇంటా బయటా కూడా ప్రజాస్వామ్య పద్ధతులు అవలంబించాలి. ఇది బ్రిటన్‌కు పరస్పర విరుద్ధం. తాను ఫాసిజానికి బలి కారాదు. కాని తన సామ్రాజ్యవాదానికి మన బోటి వారు ఆహుతి కావాలి. అందుకనే శాంతిని కోరే వారందరూ ఫేసిజాన్ని, సామ్రాజ్యవాదాన్ని నశింప జేయాలి.

★

ఇతర దేశాలు మనని ఆక్రమించుకొనగలవా?

జర్మనీ, జపాన్, ఇటలీలు మన ఇండియాపై దండెత్తుతవని అనుకోవడం ఊహా ప్రపంచంలో మునిగి తేలడం. జపాన్ భూమి మీద రావడం కష్టం. విమానాల మీద దండెత్తటం ప్రయాస. సముద్ర ప్రయాణం అసాధ్యం. చైనా అంతా మింగిన తర్వాత గాని ఇండియా సంగతి తలపెట్టదు. చైనా నంతా జయించడం కష్టం. ఒకవేళ జయించినా ఆస్ట్రేలియా, ఫిలిప్పైన్ మీద ఎక్కువ దృష్టి జపానుకు.

ఇక ఇటలీ జర్మనీలకు దృష్టి యూరప్, ఉత్తరాఫ్రికాల మీద ఉన్నది. ప్రపంచమంతా ఫాసిస్టు మయమై లొంగిపోయినప్పుడు ఏదైనా జరగవచ్చు. కాని అపుడు కూడా ఇండియాకున్న కొన్ని విలక్షణాల వల్ల విదేశీయులను ఎదుర్కొగలదు. ఇపుడు పాతుకొన్న విదేశీ యాధికారాని కంటె కొత్తగా వచ్చేవారిని ఎదుర్కొవడం అంత కష్టం కాదు. సామ్రాజ్యవాదం ప్రపంచ యుద్ధంలో ఎలాగైనా మనల్ని పాల్గొనేటట్లు చేయాలని తలంచుతున్నది. కాని పాల్గొనం. అందుకనే చైనాకు హృదయపూర్వక సానుభూతి చూపాం.



ఇండియా సైన్యం సామ్రాజ్యాధికారులది. జాతీయ సైన్యం కాదు. విదేశీయ సైన్యం. ఇది వృద్ధి కావడం సామ్రాజ్యవాదం బలపడటం.

బ్రిటిష్ సామ్రాజ్యమే ఆయుధ విసర్జన సూత్రంకి విఫల మవడానికి, నానాజాతి సమితి బలహీన మవడానికి కారణం.

మనం సామ్రాజ్య ప్రతికూలురం. అందుచే మనం ఒకటి సంపూర్ణ స్వాతంత్ర్యమూ—రెండు కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీ ద్వారా రాజ్యాంగమూ కోరుతున్నాం. ప్రపంచ శాంతికి, జాతికీ జాతికీ మధ్య సహకారానికి మనం ఎపుడూ సంపెద్దులమే.

★

నానాజాతిసమితి. నానా ప్రభుత్వ సంఘంగా మారింది. మన పేరిట నానాజాతి సమితిలో ఒక ఓటుఉంది. అది బ్రిటన్‌కు అదనంగా లాభం కలుగజేస్తుంది. ఆ ఓటు మన అభిప్రాయాన్ని తెలియజేయదు. అందుకనే ఇండియాను సమితినుండి విరమించుకోమన్నాము. స్వతంత్రం పొందినపుడే సమితితో సహకారం. ఇంకా ఈ ప్రభుత్వాల సంఘాన్ని నిజమైన ప్రజల సమితిగా మార్చడానికి యత్నిస్తుంది. ప్రపంచ శాంతి అంటే గాఢానురాగం కాబట్టే ప్రపంచ శాంతి సంఘం చేరాము. న్యాయము, ప్రజాస్వామ్యం—సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమం—ఈ మూటి పైననే నిజంగా జాతిసమితి చేయాలి. ఇతరులపై దండెత్తినవారిని ప్రతిఘటించడానికి మనం ఆర్థిక బహిష్కరణం సాగించుదాం.

నేడు ప్రపంచంలో బ్రిటన్ కూడా ప్రజాస్వామ్యం అంటున్నారు. కాని గవర్నర్ జనరల్—గవర్నర్ల వివిధ రక్షణలకు లోబడ్డ రాజ్యాంగచట్టమే ఈ ప్రజాస్వామ్యం ఎంతబూటకమో తెల్పుతుంది. ఫెడరేషన్‌ను, దాని వెనుక నున్న సామ్రాజ్యవాదాన్ని మనం ప్రతిఘటించాలి. యుద్ధం వచ్చినా ప్రళయం గల్గినా మన సమరం తుదిదాకా సాగించుతాము.

★

స్వదేశ సంస్థానాలు పూర్వవాసనలు వీడలేదు. ఇంకా ఒక శతాబ్దం క్రింద ఉన్నవి. సంస్థానాల ప్రజలలో సంచలనం కల్గింది. సంస్థాన ప్రజల పోరాట బాధ్యత వారిదేమైనా 'మనకేమని' ఊరుకోరాదు. ఆ ఉద్యమంలో శ్రద్ధవహించాలి. మైసూరులో నిర్బంధాలవల్ల అపకీర్తి సంపాదించింది. దానిని అ. భా. కాం. కమిటీ ఖండించింది. అలాంటి ఖండనాధికారం పైకమిటీకి లేదని గాంధీగారంటారు. నేను ఉందంటాను.

అనేక చిక్కులున్నా మంత్రు లైర్య సాహసాలతో ప్రవర్తించారు. ఇంకా చేయగలిగినవి చేస్తే బాగుంటుందని మనం ఆశించవచ్చు. కాని రాజ్యాంగంలో దాగియున్న సామ్రాజ్యవాద సంకెళ్లు, ప్రభుత్వోద్యోగులు పరివర్తనం కాలేకపోవడం, మంత్రులు ఎవరినీ మెప్పించలేక బాధ్యతల నిర్వర్తిస్తున్నారు. వారు మన సానుభూతికి అర్హులు.

దేశంలో అనేక నూతన శక్తులు విజృంభించాయి. అందువల్ల సంఘర్షణలూ కల్గినవి. కాని సమన్వయము, ఏకాశయ బద్ధులమయే దీక్ష మనకు కావాలి.

కాంగ్రెస్‌లో అతివాద మితవాదులున్నారు. కొందరు అతివాదులను తరిమి వేయాలని తలచారు. దీనివల్లనష్టం అపరిమితం. ఆపక్షమే లేకపోతే కాంగ్రెస్ మితవాదమై పోతుంది. జనసామాన్యంలో-కర్షక హృదయాలలో సంకోచం సంక్షోభం కల్గిస్తుంది. కడచిన కొన్ని మాసాల్లో అలాంటి ప్రయత్నం జరిగి వైషమ్యాలు హెచ్చాయి.

అతివాదులు కొన్ని తప్పులు చేశారు. తాత్కాలిక ప్రజావేశం ఊతగా గొనటం వల్లో, తమఆశయాల నెరవేర్చాలని అభిలాషవల్లో, ప్రజాదరణ కోల్పోతామనే భీతివల్లనో ఈతప్పులు కలిగాయి. అయినా మనం ఐకమత్యానికి భంగంరాకుండా సత్యం, అహింసలతో ప్రవర్తించుదాము.

ముస్లింలీగు సంపూర్ణ స్వాతంత్ర్య లక్ష్యం ఆమోదించడం ఆమోదకరం. ముస్లిం జనసామాన్యంలో రాజకీయ సంచలనం విరివిగా జరిగింది. కులపక్షపాతం, అపుడపుడూ సామాన్య మర్యాద వీడిన దౌర్జన్యం ప్రోత్సహించడం విచారకరం. కాని రాజకీయ విజ్ఞానంతో ఇలాంటివి నశించుతవి. ఈసమస్యలో అదృశ్య మయిపోతాయి.

కర్షకుడే భారతదేశానికి వెన్నెముక. అతనికండ్లలో జ్యోతి-అతని ముఖంలో తృప్తి-కన్ననాడే మనకు శుభం.

మనదేశ సమస్యలుగాని యావత్ప్రపంచ సమస్యలుగాని. పరిష్కరించాలంటే సామ్యవాదం ఒక్కటేనని త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. కాని ప్రస్తుత ముఖ్యకర్తవ్యాలు రెండు. సామ్రాజ్యవాదాన్ని నశింప చేయటం. స్వదేశ సంస్థానాలలోను ఇతరచోట్ల నిరంకుశ ప్రజాస్వామ్య పద్ధతి అంతరింప చేయటం.

## మహిళాసంఘాలలో పాటుపుజాతిస్త్రీలకు స్థాన మివ్వాలి

(7 వ పేజీతరువాయి)

కంగాను నైతికంగానే కాని, ఆర్థికంగాను రాజకీయం పోరాడరు. వాటికి పూర్తిగా వ్యతిరేకులు. స్త్రీలు రాజకీయాల్లో పాల్గొనకూడదని వాదిస్తారు. యిలాంటి పెన్నో నిరంకుశాలు పన్నెరు యీ ఉన్నతవర్గపు స్త్రీలు.

యీలాంటి బూర్జువా మహిళా సంఘాన్ని చూచి సంతోషపడే జాతీయనాయకులు కూడా అవే అంగీకరిస్తారు. యిలాంటి నిరంకుశాలు వారికికూడా ఉండక పోవు. కానీ, వారు ధనమదంచేత సమాజిక స్త్రీలను అవమానపరుస్తారు.

వీటి నన్నిటినీ మార్చి, వారు వేరే స్వల్పవాటితో సంతృప్తి చెందకుండా పాటకపు స్త్రీల హక్కుల్ని కూడా వెల్లడిచేస్తూ, మహిళాసంఘంలో వారికి కూడా సమాన స్థాన మివ్వాలి. వారిని కూడా గౌరవించాలి.

స్వాతంత్ర్య పోరాటం ఒక్క పురుషులకే కాదు. సమాజంలోని కొద్దిమంది స్త్రీలు స్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకు లౌతారు. అట్లు కాక స్వాతంత్ర్యం యొక్క నిజస్వరూపాన్ని విశాలపరుస్తూ, సమాజం చేత వ్యక్తులచేత, ప్రభుత్వంచేత పురుషులచేత అణచి వేయబడి దోపిడీ అవుతున్న స్త్రీలను కూడా చేర్చుకొని తీవ్రంగా ఆందోళన సాగించాలి: యీ దోపిడిదార్లనీ, భోగపరాయణుల్ని, వీరి కుగురువులైన మతాధికార్లకూ పట్టుకొమ్మలైన మతాల్ని, వర్ణభేదాల్ని కృత్రిమ సామాజాన్ని నాశనం చెయ్యాలి.

పురుషులు సంపూర్ణ స్వాతంత్ర్యం తెస్తారనీ, నిరుపయోగకరమైన సంస్కరణాలు తెస్తారనీ, వారి అడుగులపై నడిచే బూర్జువా జాతీయ నాయకుల బాటకాల్ని నమ్మకూడదు. వారు పోరాడే పోరాటంతో తరతరాలనుంచీ వచ్చే బానిసత్వం నిర్మూలం కాదు.

యీ బూజుపట్టిన హెచ్చు తగ్గు సమాజాన్ని కూకటివేళ్ళతో కుదిపేసి ఆ చచ్చు సమాజాన్ని మచ్చుకైన కానరాకుండ చెయ్యాలి. సరిక్రొత్త సమాజం స్థాపించి తీరాలి. ఆనాడే స్త్రీ, స్త్రీలయొక్క నిజస్వరూపం చేగలము.

భారత స్త్రీలలో ధీరత్వం శక్తి, విప్లవ జ్వాల రేగి భారతదేశ స్త్రీ సంపూర్ణ స్వరాజ్యానికి తోడ్పడాలి. స్త్రీలు రాజకీయంగా రణగంగంలో దూకి మారుమూలల్లోని స్త్రీల నందరినీ రెచ్చగొట్టాలి. ఆనాడే నిర్జీవమౌతున్న స్త్రీ అద్భుత దశలోకి రాగలదు. ఆ నా డే దేశంలో దరిద్రిత, నిరక్షరాస్యులు లేకుండా తుడిచివేయబడతారు. అనాడు స్త్రీజాతి హక్కుల్ని సంపూర్ణంగా పొంది స్త్రీ పురుషు లిద్దరూ సమమై మానవత్వాన్ని సంపాదించగల్గుతారు. అనాడు యీ పురుషాహంకారం ఉండదు. ఏ స్త్రీ కూడా దోపిడీ అవదు....

## మహిళా సంఘ ఎన్నికలు.

యీ తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘము యొక్క అధీనములో గుడివాడ, దివి, బందరు, కైకలూరు తాలూకాలు నాలుగున్నూ, బందరు—గుడివాడ పట్టణములు రెండున్నూ చేరియున్నవి.

18 సం॥ దాటిన స్త్రీ ఎల్లయూ ఒక అణా సభ్యత్వరుసుము చెల్లించి సంఘ ఆశయములను ఆమోదించుట వలన ఆ యా ప్రాథమిక సభ్యురాలుగా పరిగణింపబడును.

ఫిబ్రవరి నెలాఖరులోగా చేరిన సభ్యులే జరుగనున్న జిల్లా సంఘ ఎన్నికలలో పాల్గొన నర్హులు.

జిల్లా సమావేశమునకు ప్రతినిధుల సంఖ్య 100 రకు మించి యుండరాదు. 10 మంది ప్రాథమిక సభ్యులు ఒక ప్రతినిధిని ఎన్నుకొని సమావేశమునకు పంపవచ్చును. సభ్యుల సంఖ్య పెరిగేయెడల ఎప్పటి కప్పుడు కోటా నిర్ణయింపబడును. కనీస సంఖ్య పదిగానే యుండును.

జిల్లా కార్య నిర్వాహక సంఘమునకు ఒక అధ్యక్షురాలు, ఇరువురు కార్యదర్శినులు 10 మంది సభ్యురాండ్రు వుండవలెను.

ప్రతి సంవత్సరం మార్చినెలలో జిల్లాసంఘ నూతన కార్య నిర్వాహక వర్గము యేర్పడవలెను.

నూతన సమావేశము నేర్పరచుట, నూతన ప్రాథమిక సంఘముల నేర్పరచుట, అమలులో వున్న కార్య నిర్వాహక వర్గమే చేయవలెను.

జిల్లా సంఘ ప్రధాన కార్యస్థానము ప్రస్తుతం జమిగొల్వేపల్లిలోనే యుండును.

యీ నిబంధనము మార్చినెలలో జరుగు సమావేశము వరకే చెల్లును. తదుపరి ఆ సమావేశములో నిర్ణయింపబడిన నిబంధనలు మాత్రమే అమలులో వుండును.

వ. సీతామహాలక్ష్మమ్మ,
తూర్పు కృష్ణా మహిళా సంఘం.

### మహిళా సంఘ సభలు.

12—2—38 వ తేదీన బెజవాడ తాలూకా తెన్నేరులో మహిళా సంఘసభ జరిగినది. శ్రీమతి వనుకూరి సరస్వతమ్మగా రధ్యక్షత వహించిరి. యడవల్లి నాగభూషణంగారు అధ్యక్షురాలు, స్త్రీసంఘాలు, యుద్ధాలు, సామ్రాజ్యవాదం మొదలగువాటిని గురించి ఉపన్యసించారు. గ్రామ మహిళా సంఘానికి వనుకూరి సరస్వతమ్మగారు అధ్యక్షులుగను గొంది మంగమ్మగారు కార్యదర్శినిగను నియమించిరి.

### మంత్రిపాలెం.

10—2—38 వ తేదీన మంత్రిపాలెంలో స్త్రీసభకు పురుషులు కూడ విచ్చేసి విషయాలను విన్నారు. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగా రుపన్యసించారు. గ్రామ మహిళా సంఘానికి చిగురుపాటి లలితాంబగారు అధ్యక్షులుగను, చిగురుపాటి ధనలక్ష్మమ్మగారు కార్యదర్శినిగా ఎన్నుకోబడినారు.

### కాజ.

కాజ గ్రామ మహిళా సంఘంలో 50 మంది సభ్యులున్నారు. రామిరెడ్డి మంగమ్మగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. ప్రతి వారం రాజకీయాలు స్త్రీల అభివృద్ధి గురించి చర్చింతారు. 1—2—'38 వ తేదీన బహిరంగ సభ జరిగినది. అధ్యక్షులు, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారును ఉపన్యసించారు.





# ★ కాంగ్రెస్ కబుర్లు ★

## మా ప్రత్యేక ప్రతినిధి

నెహ్రూపండితుడు ఖాళీచేసిన స్థానాన్ని సుభాష్ బోసు అలంకరించాడు. ఇంతకంటె తక్కువ వయస్సుగల నాయకు డిదివరకెవ్వరూ కాంగ్రెసు మహాసభాధ్యక్షత వహించలేదు. దేశంలో రోజురోజుకూ చెలరేగుతున్న ప్రజాఉద్యమాన్ని నడిపించగల సామర్థ్యం అతని ముఖంలో మూర్తీభవించింది. అనేక యెత్తుగడలలో విజృంభిస్తూన్న సామ్రాజ్యాధికారుల దౌర్జన్యవిధానాన్ని ధైర్యంగా యెదుర్కొనగల శక్తి అతనిలో కనబడింది. దేశంలో బయలుదేరిన మహానుహో జాతిమైక్య సంఘటన అనే ఓడను నడపగల చాకచక్యం అతని ముఖంమీద, తాండవ మాడింది. అతడుచేసిన ప్రారంభోపన్యాసలో అయిదారు నిమిషముల పట్టుదల, కార్యదీక్ష, ఉద్రేకం వెల్లివిరిశాయి. కాంగ్రెసు మహాసభయొక్క కార్యక్రమా న్నంతటినీ ధైర్యంగానూ, స్వతంత్రంగానూ నెరవేర్పగలడని విశ్వసించాను.

★

కాని, అధ్యక్షస్థానం నుంచి ప్రవేశపెట్టబడిన మొదటి తీర్మానంతో ఈ ఆశ, యీ ఉత్సాహం కొంత సన్నగిలినాయి సాధారణంగా మొట్టమొదటి తీర్మానం చనిపోయిన నాయకుల యెడల సానుభూతిని తెలిపేది అయివుంటుంది. ఈ యేటి కార్యక్రమం కూడా సానుభూతి తీర్మానంతోనే ప్రారంభం అయింది. మోతీలాల్ నెహ్రూ, పార్వతీదేవి జగదీశ్ బోసు మొదలైనవారి అకాల మరణమునకు సభవారు సానుభూతిని తెలియపరుస్తూ ప్రతిపాదింపబడ్డ తీర్మానంలో హరీంద్రనాథ మున్షీయొక్క పేరుకూడా చేర్చవలసిందని ఒకచిన్న సవరణవచ్చింది. ఆవిధంగా చేర్చవచ్చునో చేర్చరాదో అనే మీమాంస వెంటనే బయలుదేరింది. అధ్యక్షుడుమాత్రం సవరణ కనుకూలంగానే ఉన్నట్టు కనబడ్డాడు కాని,కృప్లానీజవహర్ పండితులు మాత్రం ఆవిధంగా జరుగకుండా చేశారు. ఉపన్యాస వేదికమీద యీముగ్గురికీ చర్చప్రారంభ మయింది. అప్పుడప్పుడు దూర శ్రవణయంత్రంలో వీరిమాటలు వినబడుతూ ఉండేవి. మున్షీయొక్క పేరును తీర్మానంలో చేర్చడానికి తనకేమాత్రం అభ్యంతరం లేదనిన్నీ, తీర్మానంలోఉన్న నలుగురూ గతసంవత్సరంలో మరణించారనిన్నీ, మున్షీ యీసంవత్సర మే గతించాడనిన్నీ, కాబట్టి అతనిపేరు చేర్చలేదనిన్నీ సుభాష్ బోసుకు సమాధానం చెప్పారు సవరణను ఉపపాదించినవారు తమసవరణను విరమించుకోలేదు. జమల్లీ ఉపన్యాస వేదికమీద అధ్యక్షునికీ కృపలానీ జవహర్లాల్ పండితునకూ చర్చప్రారంభమైంది. అఖరికి. సుభాష్ బోసు రూలింగు యిచ్చాడు. వర్కింగు కమిటీ యిదివరలో నే యీతీర్మానాన్ని ఆమోదించి వ్రాసియున్న మూలాన్ని సభ్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించాలని హెచ్చరించాడు. హెచ్చరించి, వెంటనే అందర్నీ లేచి నిలువబడి తీర్మానానికి అంగీకారాన్ని తెలియపరచాలని అన్నాడు. అంతా వెంటనే లేచి నిలబడ్డారు, తీర్మానం ఆమోదించబడింది.

అధ్యక్షునిచేత ప్రతిపాదింపబడ్డ మొట్టమొదటి తీర్మానానికే యింత చర్చ బయలుదేరిందే, మిగిలిన తీర్మానాల కెంత చర్చ బయలుదేరుతుందో నసుకున్నాను. కాని ఆవిధంగా జరగలేదు. ఖండాంతరములయందలి భారతీయులనుగురించిన తీర్మానం, జాంజిబార్ లవంగ వర్తకులకు సంబంధించిన తీర్మానం, చైనా ప్యాలస్తైన్ తీర్మానాలు మొదలైనవన్నీ చర్చ లేకుండానే అధ్యక్షునివల్ల ప్రతిపాదింపబడి ఆమోదింపబడ్డాయి.

ప్రపంచ యుద్ధాన్నిగురించీ, భారతీయుల కర్తవ్యాన్నిగురించి మరొక తీర్మానం వచ్చింది. మొదట్లో దీన్ని అధ్యక్షుడే ఉపపాదించాడు గాని తీర్మానానికి సవరణ వచ్చుటచేత జవహర్లాలే ఉపపాదించవలసి వచ్చింది. దాని కొకసవరణ సుందరయ్య ఉపపాదించాడు. ప్రపంచ యుద్ధానికి గ్రేట్ బ్రిటన్ చేస్తూన్న ప్రయత్నాలను భారతీయులంతా యెదుర్కొనితీరాలని తీర్మానంలో ఉంది. సుందరయ్యయొక్క సవరణ ఏ యే మార్గాలద్వారా ఎదుర్కొనాలో స్పష్టంగా సూచించింది. యుద్ధసమయంలో భారతీయులెవరూ సైనికులుగా చేరరాదనీ, శాసనసభ ప్రభుత్వానికి యుద్ధఋణాలు శాంక్షన్ చేయరాదనీ, కార్మిక కర్షక జనసామాన్యాన్ని వారి వారి వర్గసంస్థలద్వారా రాజకీయ చైతన్యాన్ని వృద్ధి చేయాలనీ, యిప్పటినుంచీ రైల్వేకార్మికులనూ ఓడకార్మికులను బలమైన కార్మిక సంఘాలలో చేర్చి సామ్రాజ్యవాద యుద్ధంలో ఇంగ్లండుకు సహాయపడకుండా ప్రచారం సాగించవలెననీ— యీ నాలుగు పద్ధతులమీద దేశంలోని కాంగ్రెసు కమిటీలు యుద్ధప్రతికూల ప్రచారాన్ని తీవ్రంగా సాగించాలని సుందరయ్య స్పష్టీకరిస్తూ మాట్లాడాడు. జవహర్లాల్ అతనికి జవాబుచెపుతూ కొన్ని వింతవిషయాలు చెప్పాడు. కార్మికసంఘాలు తమ నిత్యజీవితంలో ఉండేకష్టాల్ని తొలగించుకోవటానికేనట; కార్మికసంఘములు యుద్ధప్రతికూలోద్యమంలో ముఖ్యపాత్రను ధరించగల శక్తిగలిగియున్నప్పటికీ, కాంగ్రెసు కమిటీలే యీ సంఘటనకు పూనుకుంటే వాటికీ కార్మికసంఘాలకీ సంఘర్షణ తప్పదట!

★

తరువాత, ఫెడరేష మీది తీర్మానం చర్చకు వచ్చింది. వర్కింగు కమిటీ తీర్మానాన్ని భూలాభాయి దేశాయి ఉపపాదించాడు. మసానీ, రంగా, డా॥అహమ్మద్ మూడు సవరణలు చేశారు. జవహర్లాల్ నెహ్రూ బలపరచాడు. భూలాభాయిదేశాయి వాటికి సమాధానం చెపుతూ, సవరణలు తీసుకవచ్చిన వారందరూ వర్కింగుకమిటీ సభ్యుల ఆలోచనలను అనుమానంతో చూస్తున్నారని వాదించాడు. ప్రత్యక్ష ప్రతిఘటన అనే ఆయుధం మొదటినుంచీ కాంగ్రెసు అంగీకరించే యున్నది కాబట్టి యిక ముందుకూడా దానిని విడిచిపెట్టదనిన్నీ, తీర్మానంలో ప్రతి ముఖ్యవిషయం వ్రాయడం అసాధ్యమనిన్నీ, కార్మిక కర్షకుల క్షేమసౌకర్యములకొరకే కాంగ్రెసు పోరాడుచున్నదనిన్నీ, మాటిమాటికీ కార్మికులు, కర్షకులు అనే శబ్దాలు వాడేవారు పాశ్చాత్య గ్రంథాలు చదివి నేర్చుకున్న శబ్దాలనిన్నీ, కాంగ్రెసు అంటే కార్మికులు,కర్షకులే అనిన్నీ దేశాయిగారు శెలవిచ్చారు. పెద్ద మెజారిటీతో తీర్మానం గెలిచింది. సవరణ లన్నీ వీగిపోయాయి.

హరిపూర్ (17-2-38)

(12 వ పేజీ తరువాయి)

ప్రయత్నించుచున్నట్టియు, సామ్రాజ్య తత్వమును ప్రతిఘటించి పోరునట్టివా రందరు కాంగ్రెసులో చేరి పోరాడగి యున్నారు. కావున ఆసేతుహిమాచలపర్యంత భారతదేశమును భారత జాతీయ మహాసభాపతాక క్రిందికి తెచ్చెదము గాక! కాంగ్రెసును ప్రజా ప్రతి నిధి సంస్థగా చేయుటకును, సామ్రాజ్య తత్వమును ప్రతిఘటించి పోరు సందరికిని ... కల్పించుటకును తీవ్రపక్షమునారు తమ సర్వశక్తులను వినియోగించెదరుగాక! యని నేను వారికి విజ్ఞాపనము గావించుచున్నాను. ఈ విజ్ఞాపనము చేయుటకు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ వైఖరి నాకు ప్రోత్సాహము కలిగించుచున్నది. భారతదేశము విషయమై వా రవలంబించుచున్న వైఖరి భారత జాతీయ మహాసభా వైఖరికి అనుగుణ్యముగా నున్నది.

★

ఇంకను అనేక సంవత్సరముల వరకు భగవంతుడు గాంధిమహాత్మునకు ఆయుష్యము ప్రసాదించుగాక యని కోరుచు నేను ఉపన్యాసము పూర్తిచేయుచున్నాను.

## రైతు సంఘాలు
## రైతు నాయకులు
# వ్యవసాయ కూలీ ఉద్యమానికి అనుకూలురే
## వెన్నెలగంటివారి దురాగ్రహం

[ సంపూరి ప్రసాదరావు ]

ఇటీవల మర్లపాడులో ఉపన్యసిస్తూ వెన్నెలగంటి రాఘవయ్యగారు వెలిబుచ్చిన అభిప్రాయములు చాలా విషాదాన్ని కల్గిస్తున్నాయి. సత్యాన్ని మరుగుపర్చి, అకారణముగా రైతునాయకులను, ఉద్యమాన్ని దూషించుటలో గల అంతరార్థ మేమో తెలియకున్నది. తానూ సోషలిస్టునని చెప్పుకొన్న వీరు సోషలిస్టులను, కమ్యూనిస్టులను కాంగ్రెసు వ్యతిరేకులనీ, కులతత్వ వాదులనీ నిందించుట కాంగ్రెసు ఎన్నిక లయిపోనవి గనుకనా యని సందేహించవలని వస్తోంది. సుంద రయ్య, రామలింగయ్య, బలరామిరెడ్డి, రామారావు, వెంకయ్య, రామం సోషలిస్టు ప్రముఖులను గల్గిన ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ స్థాయి సంఘాన్ని కాంగ్రెసు వ్యతిరేక మనవలెనో, కులతత్వవాదుల కూటమి యనవలెనో తెలియకున్నది. తాను సంయుక్త కార్యదర్శిగాగల సంఘాన్నే కులతత్వవాదుల కూటమి యనిపిస్తున్నది రాఘవయ్యగారి శేముషీ ప్రభావం.

వ్యవసాయ కూలీ ఉద్యమ నాయకు లనేకులతో నాకు పరిచయ మున్నది. తూ. గో. వ్యవసాయకూలీ సంఘ ప్రధాన కార్యదర్శి యగు కొరపాటి పట్టాభిరామయ్యగారితో రెండేండ్లు కలిసి పనిజేసా. కాని ఎవ్వరును రాఘవయ్యగారి వింత అభిప్రాయాలను, ఆగ్రహమును వెల్లడించలేదు. పైగా రైతు సంఘాలు, నాయకుల సానుభూతిని సహాయమును కొనియాడు చుండెడివారు. నిజమైన, వ్యవసాయకూలీ ఉద్యమాభిలాషు లెవ్వరును రాఘవయ్యగారితో ఏకీభవించుట లేదనీ, ప్రముఖు లిద్దరు రాఘవయ్యగారి అభిప్రాయమునకు అసమ్మతిని వెలిబుచ్చుచూ అట్టి విరోధ భావమును మార్చుకొననిచో సహకారమును మానుకొందుమని వారికి వ్రాసినటుల తెలియుచున్నది. కాబట్టి రాఘవయ్యగారి అభిప్రాయాలు వారికి మాత్రమే చెందినవనీ, కొన్ని వ్యక్తిపరములైన ద్వేషాలు ఈ ఆగ్రహమునకు కారణమనీ, వ్యవసాయకూలీ ఉద్యమ దృక్పథమునకు, వీరి అభిప్రాయములకు సంబంధమే లేదనీ గ్రహించవచ్చును.

ఇక రాఘవయ్యగారి నీలాపనిందలు. ఋణ నివారణ బిల్లు వ్యవసాయకూలీలకు వద్దని రైతునాయకు లంటారని వీరి ఆరోపణ. దేశమందలి ఆందోళనను కించిత్తైనను గుర్తించినవారికి ఈ నింద కేవలము కల్పితమని తెలియగలదు. రాఘవయ్యగార్ని కూడా ఆచార్య రంగా, కొమ్మారెడ్డి సత్యన్నారాయణ, చలసాని వాసుదేవరావు, వెన్నేత్స సూర్యనారాయణ మొ॥ రైతు నాయకుల స్టేటుమెంటులను, రైతు సంఘాల మహజర్లను, మెమోరాండములను, డెప్యుటేషన్లను గుర్తించమని కోరుతున్నాను. వారికి చప్పున తెలియగలందులకై ఈ క్రింద రెండు ఉదాహరణల నిస్తున్నాను.

"ఋణ నివారణ చట్టమును గూర్చి, రైతులకు, వ్యవసాయకూలీలకు, కౌలుదార్లకు మా విన్నపము." అన్న ఆం॥ రా॥ రైతుసంఘ కరపత్రములో సవరణలు.

1. (అ) వ్యవసాయదారు పదములో వ్యవసాయ కూలిని గూడ జేర్చుట ముఖ్యావసరము.

(ఆ) .... .... .... ....

సెంటు భూ వసతియైనా లేక, కాయకష్టముమీదనే ఆధారపడి వ్యవసాయ వృత్తిమీద జీవించు వ్యవసాయ కూలీలకు బిల్లు అమలులోనికి వచ్చు తేదీకి గల యావత్తు ఋణములను రద్దయినట్లు ప్రకటించవలెను.

.... .... .... ....

ఈ బిల్లు వలన తమ ఋణములకు యావత్తు వడ్డీ రద్దుపరచబడు సదుపాయమును పొందనున్న రైతులు, తమ బిడ్డల వలె తమ కండయై, తమ వ్యవసాయ కృషికి మూలాధారులగు వ్యవసాయకూలీల ఋణములు సంపూర్ణముగా రద్దుపరుపబడుటకు వారితో గలిసి, తీవ్రాందోళనను సాగించాలి."

ఋణనివారణ వార యాత్రలలో సమర్పింపబడిన మహజరులోని కోర్కె చూడండి.

(7)"ఈబిల్లు వ్యవసాయ కూలీలకుకూడ వర్తింపజేసి వ్యవసాయ కూలీలయొక్కయు, కౌలుదార్లయొక్కయు ఋణములను యావత్తు రద్దుచేయవలెను"

ఈవిధంగా రాఘవయ్యగారుకూడా మేల్కొనకముందే రైతుసంఘాలు ఋణముల బిల్లును వ్యవసాయ కూలీలకుకూడ వర్తింపజేసి వారి యావత్తు ఋణములను రద్దుచేయవలెనని కోరియున్నది.

ఇంక రైతునాయకులు వ్యవసాయ కూలీలను మోసం జేస్తున్నారన్ననింద. ఈవిషయంలో కూడా రాఘవయ్యగారు పూర్తిగా పొరబడ్డారని తెల్పుచున్నాను. వ్యవసాయ కూలీల హక్కులను ఇదివరకే ఎన్నడో రైతుసంఘం గుర్తించివున్నది. ఆప్రకారమే రైతునాయకులు సంచరిస్తూ రైతులనందరను ఆహక్కులను పాటించమని పదేపదే హెచ్చరిస్తున్నారు. అవసరమైతే జిల్లా రైతుసంఘముల తీర్మానములను గమనించ వలసినదని కోరుచున్నాను. ఆం॥ రా॥ రైతుసంఘము 2 ఏండ్లక్రింద చేసిన తీర్మానము నీక్రింద పొందుపరుస్తున్నాను.

"మన పరమార్థమైన కార్మిక, కర్షకాధికారమును పొందుటకును, తాత్కాలికముగా జమీందారు, సాహుకార్లవలన గల్గు బాధలను తొలగించు కొనుటకును వ్యవసాయ, పారిశ్రామిక కూలీలతో రైతులు సంపూర్ణసహకారము గల్గియుండుట అవసరమనియు, అందులకై వ్యవసాయ, పారిశ్రామిక కూలీల కోర్కెలను రైతులంగీకరించి కార్మిక, కర్షకసమ్మేళనము, సామరస్య మభివృద్ధిచేసి కొనవలయుననియు ఈసభవారు రైతులను హెచ్చరించుచున్నారు."

సంపూర్ణంగా తెలిసికొనవలెనంటే ఆచార్యరంగాగారిచే రచింపబడ్డ "వ్యవసాయకూలీలు-రైతుల ధర్మవైఖరి" యన్న కరపత్రమును చదువవలసినదిగా హెచ్చరించుచున్నాను.

పిచ్చికొలతలు, దౌర్జన్యము మొ॥ అక్రమాలు రైతులు చేస్తున్నారంటే అది వారిఅజ్ఞాన ఫలితము కాని రైతునాయకులు వీటిని ప్రోత్సహిస్తున్నారనుట తగనిపని. ఇట్టి స్వల్పమోసములను నిర్మూలించుట రైతునాయకులు తమ శాయశక్తులను ప్రయత్నిస్తున్నట్లనేక ఉదాహరణ లున్నాయి. నేటి ఆం॥ రా॥ రై॥ సంఘాధ్యక్షులగు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారు గ్రామరైతు ఉద్యమంలో ప్రాధాన్యత వహించక పూర్వం చాలాకాలంనుండి ఇట్టి దురాచారాలను మాన్పుటకు ఆందోళన చేస్తూవచ్చారు. స్వయంగా తామట్టివి మాన్పించుటేగాక, తమ జీతగాండ్లు భూములు కొనుక్కొనుటకై తమవద్ద అప్పుగా తీసికొన్న రు 2000-లను 1935 లోనే పూర్తిగా రద్దుపర్చియున్నారు. ఈవిధంగా రైతునాయకు లెన్నడును వ్య॥ కూలీల శ్రేయస్సుకై పాటుపడుతూనే యున్నారు. అధవా ఎవరైనా ఇట్టిమోసాలను అవలంబిస్తున్నా, ఆపాపాన్నంతా రైతుసంఘం మెడకుచుట్టటం అన్యాయం. సత్యం, అహింసలనే సూత్రాలను పునాదిరాళ్ళుగాగల కాంగ్రెసు సంస్థలోనే అనేకమంది వంచకులుజేరుట గమనిస్తూనే యున్నాము. అట్టియెడ ప్రజాసామాన్య సంస్థయైన రైతుసంఘంలోకూడా ఇట్టివంచకులు చాటుగాజేరి యుండవచ్చు. కాని ఉద్యమవైఖరి మాత్రం ఇట్టిమోసములను అరికట్టుచేయని విన్నవించుకొను చున్నాను.

ఇట్టి విషయాలలో రైతుసంఘాలకృషి తగినంతగా ఫలప్రదమగుట లేదన్నచో దానికి రాఘవయ్యగారిబోటి వారి అసహనము, అననుభూతి, లనుమానములే కారణమని విన్నపము. కాని ఇట్టి ప్రతికూల భావములు రైతుఉద్యమమునకు గాని, వ్యవసాయ కూలీ ఉద్యమమునకుగాని, శ్రేయోదాయకము గాదు. వ్యవసాయ వృత్తిమీదనే జీవించు వారందరు కలిసి తమ్మందరను పీడించు జమీందారీ, షాహుకారీ పద్ధతులను, ప్రభుత్వమును ఎదిరించవలసి యున్నది. కాని రాఘవయ్య గారిబోటి కొలదిమంది యొక్క తొందరపాటుచే నది వెనకత్రోవ పట్టుచున్నది. కాని ఇప్పటికైనను రాఘవయ్యగారు తమ అభిప్రాయాలను మార్చుకొని, రైతు, కూలీలసఖ్యతకై పాటుబడెదరని నమ్ముచున్నాను.

తాము రాయిస్టుకాదని రాఘవయ్యగారు ఒకప్పుడు సగర్వంగా చెప్పుకొన్నారు. కాని "రైతుసంఘాలట, రైతుదండులట" యన్న రాఘవయ్యగారి వెక్కిరింపు రాయిజము కాదా?



## రాజాజీ
# రాజకీయ ఖైదీలు

మద్రాసు కోర్టులలో శిక్షింపబడి ఇతరరాష్ట్రాల జైళ్ళలో కృశించుతున్న ఖైదీలు 6 గు రున్నారు. వీరి విడుదల విషయమై రాజాజీ ప్రయత్నం చేసినట్లు ఏ ప్రకటనా వెలువడ లేదు. తమ రాష్ట్రంలో ఆఖైదీలు లేరని ప్రకటించారు రాజాజీ. పైగా ఈ ఖైదీలు రాజకీయఖైదీలే కారని అన్నారు.

ఈ వ్యాసం ముగించేసరికి ఈ సమస్య పైననే యు. పి. బీహార్, మంత్రులు రాజీనామా నిచ్చారు.

సం.

★

### శంభూనాధ ఆజాద్

సంయుక్త రాష్ట్రాలలో ఒకపల్లెటూరిలో జన్మించాడు. ఇపుడు తనరాష్ట్రంలో నైనీసెంట్రల్ జైలులో ఉంటున్నాడు. తనరాష్ట్రాన్ని ఏలేది కాంగ్రెసు ప్రభుత్వం. తాను కాంగ్రెస్‌ప్రభుత్వం ఉన్న మద్రాసురాష్ట్ర ఖైదీ. అయినా విముక్తి కలుగలేదు. ఇపుడీ మధ్యనే నిరశనవ్రతం చేశాడు. యు. పి. ప్రధానమంత్రి, పంత్‌గారి వాగ్దానంవల్ల మానివేశాడు.

"ఆజాద్" అనే హిందీమాటకు స్వాతంత్ర్యం అని అర్థం. పుట్టుకతో పెట్టినపేరు ఇతనికి సార్థకమయింది. చిన్నప్పటినుండి స్వాతంత్ర్య ప్రియుడయినా, 1930 వరకు అతడు రంగంలోకి దిగలేదు. గాంధిగారి అహింసాత్మక ఉద్యమంలో పాల్గొన్నాడు. 'సత్యాగ్రహి' యై జైలుకు వెళ్ళాడు. కాని దానిలో నమ్మకం పోయింది. కొందరి యువకుల్ని ప్రోగుచేసి టెర్రరిస్టు ఉద్యమం పంజాబులో ప్రారంభించాడు. పంజాబునుంచి మద్రాసువెళ్లాడు. అక్కడ ఇంకొ నల్గురితోపాటు ఊటీబ్యాంకు దోపిడిలో అరెస్టుచేయబడినాడు. యావజ్జీవ శిక్ష విధించారు. సామ్రాజ్య వాదుల ఏజంట్లు. కేసులో ఇతడు 'బెంగాలు అనుశీలనసమితి' సభ్యుడనీ, ప్రసిద్ధ టెర్రరిస్టుగు శీతానాద్ దే ప్రియమిత్రుడు అనీ తెలిపారు. కొన్నాళ్ళు దేశంలో ఉంచినా తరువాత అండమానులకు పంపారు. గత జూన్ జులైలో అండమానులో జరిగిన నిరశనవ్రతంలో ఆజాద్ కలవకుండా ఉంటాడా? ఆ నిరశన వ్రతం, హెన్రీక్రెయిక్‌గారి ఆ 'స్వర్గ' వాతావరణం ఇతని ఆరోగ్యాన్ని మట్టిలోకలిపింది. పూర్వం 'ఆరోగ్యమందిరం' అనదగిన అతని శరీరం నానావ్యాధిగ్రస్త మయింది. ఈసారి నైనీ సెంట్రల్ జైలులోని నిరశనవ్రతం అతని రక్తం అంతా త్రాగేసింది. ఈ శిధిలమయిన అభాగయువకుని విముక్తి ఇంకెన్నాళ్ళకు?....

### ప్రేమప్రకాశ్

శంభూనాద్ ఆజాద్‌తో చేతులూ చేతులూ కలిపి పనిచేసాడు. అతనితోపాటు యావజ్జీవశిక్ష పొందాడు. అండమాను దీవులకు కూడ పోయాడు. ఎలాంటి కఠిన, కష్టసమయాలలో కూడ ఈ స్వాతంత్ర్య యోధుడు మందహాసం చేస్తుండేవాడు. అండమాను నిరశనవ్రతంలో ఇతడు కూడ పాల్గొన్నాడు. అండమానునుండి ఇతర ఖైదీలతోపాటు ఇతనిని [illegible] తీసుకవచ్చారు.

★

ఇపుడు లాహోరు సెంట్రల్ జైలులో నున్నాడు. నిరశనవ్రతంలో నెమ్మది నెమ్మదిగా తన రక్తబిందువుల నర్పిస్తున్నాడు.

ప్రేమ ప్రకాశ్‌కు యూనివర్సిటీ డిగ్రీలు లేకపోయినా జైళ్లలో రాజకీయ చరిత్రను—ఉద్యమాన్ని బాగా చదివి అవగాహనం చేసికొన్నాడు.

### ఖుశీరాం మెహతా

శంభూనాధ్ ఆజాద్‌తోపాటు కేసులో చిక్కొన్నాడు. పదేండ్లు కఠిన శిక్ష పొందాడు. అతని వదనంలో విచారరేఖ ఉండేది కాదు. దరహాస వదనం అతనిది. అతని బలిష్ఠదేహం, విస్ఫారిత నేత్రాలు.... చూడటంతోనే ఒక అనురాగం ఏర్పడేది. కాని నేడు అత డస్థిపంజరం. అండమాన్ నిరశనవ్రతం వల్ల కృంగి కృశించాడు. కానినేడు మళ్ళాలాహోర్‌లో తన మిత్రులు నిరశనవ్రతం పూనితే ఇత నేమాత్రం వెనుదీయలేదు. శంభూనాధ ప్రియమిత్రుడగు ఈ యోధుడు లాహోర్ సెంట్రల్ జైలులో నున్నాడు. నిరశనవ్రతమూని మిగిలిన శక్తి కాస్తా దానికి బలిచేస్తున్నాడు.

### హాజ్‌రా సింహ్

ఇతడు కూడా మద్రాసులో శంభూనాధ్‌తోపాటు పట్టుబడ్డాడు. 10 ఏండ్ల శిక్షకు గురి అయ్యాడు. అండమానులకు పంపారితనిని. 54 దినాలు అండమాను జైళ్లలో నిరశనవ్రతం పూని భయంకర వ్యాధులకు పాలయ్యాడు. కుడికాలు పూర్తిగా పనిచేయకుండా పోయింది. అండమాన్‌నుండి తీసుకవచ్చాక ఆలీపూర్ జైలుకు హాజార్‌సింహ్‌ను పంపింది ప్రభుత్వం. తర్వాత లాహోర్‌కు మార్చింది. అంత అనారోగ్యంలో కూడ మళ్ళీ లాహోర్‌లో తన సోదరులతోపాటు నిరశన వ్రతం పూనాడు.

### బచ్చూలాల్

టెర్రరిస్టు ఉద్యమంలో చేరక ముందు బచ్చూలాల్ కాంగ్రెస్ వాది. కాంగ్రెస్ కార్యదర్శి కూడాను. శంభూనాధుని కలిసికొన్న తర్వాత ఇతని భావాలలో మార్పు వచ్చింది. మద్రాసులో అరెస్టయినాడు శంభూనాధ్‌తోపాటు. జైళ్ల బాధలతో అతని శరీరం గుల్ల అయింది. మనస్సు చెడిపోయింది. చివరకు బెనారస్ పిచ్చి ఆస్పత్రిలో ఉంచారు. నేడు కూడా బచ్చూలాల్ ఆ పిచ్చిలోబడి కొట్టుకుంటున్నాడు....

## గీతావళి

★

### వాడు

శ్రీరంగం శ్రీనివాసరావు.

అందరం కలసి చేసిన ఈ
అందమైన వస్తు సముదాయం అంతా
ఎక్కడో ఒక్కడే వచ్చి
ఎత్తుక పోతూ ఉంటే చూచి,
'అన్యాయం, అన్యాయం!' అని మేమంటే
'అనుభవించాలి మీ కర్మం' అంటాడు.

★

పొద్దుపొడిచి పొద్దు గడిచే దాకా
ఎద్దుల్లాగు పనిచేసే మమ్మల్ని
మొద్దుల్నీ మొరటులనీ చేసి
ముద్దకి కూడా దూరం చేశాడు,
'ఘోరం ఇది, దారుణం ఇ'దంటే
'ఆచారం! అడుగు దాటరా' దంటాడు.

★

భరించడం కష్టమై పోయి
పనిముట్లు మేము క్రిందను పడవైచి
'చెయ్యలేం, చస్తున్నాం మేము,
జీవనానికి ఆసరా చూపించ'మంటే
నోరు మూసి, జోడు తీసి కొట్టి
'దౌర్జన్యానికి దౌర్జన్యం మం'దంటాడు.

( 4 వ పేజీ తరువాయి )

గుండెచీల్చే బాధకరమైన మూల్గుతో ఆ దురదృష్ట జీవియిలా అన్నాడు.

'మీరు....హారన్....మోగించలేదు.'

దొరగారికి ఆగ్రహ మెక్కువయింది.

'బుద్ధిహీనుడా! పేవుమెంటునుంచి కిందకు ఎందుకు దిగావ్?' అని గర్జించాడు. కోపం పట్టలేక బూటుకాలితో బలంగా గుండెప తన్నాడు.

'నేటివ్ బద్మాష్' అన్నది మేడమ్ హెలియోట్రోప్.

★

మరునాడు టైమ్సు ఆఫ్ ఇండియా సంపాదకీయంలో క్రింది విధంగా వ్రాసినది.

"గతరాత్రి దాదర్ హీరాబాగ్ మణీబాగ్ ప్రాంతంలో లోహితశర్మ అనే వ్యక్తి, అజాగ్రత్త వల్ల కారుక్రింద పడి మరణించాడు. బుద్ధిహీనులయిన కొందరు మనుష్యులు బాధ్యత గుర్తెరుగక బాటలమీద అప్రమత్తతగా తిరుగుతారు. ఇకమీదట నిరుపయోగులయిన యిట్టి బుద్ధిహీనులు రోడ్లమీద నడవకుండా తగు కట్టుబాట్లు ప్రభుత్వము చేస్తుందని ఆశిస్తాము. అకారణంగా విన్నసర్ జాన్ గ్రోటీగారికి నాట్యశాలను చేరుట ఆలస్యమయినది. వారికి మా సానుభూతి."

## స్పానిష్ ప్రభుత్వ భవితవ్యం

( 5 వ పేజీ తరువాయి )

ప్రస్తుత పరిస్థితులుచూస్తే, ఈరోజు స్పానిష్ ప్రజా ప్రభుత్వమునకున్న బలం ఏకాలమందూ లేదు. ముసలివారు, పిల్లలు తప్ప అందరూ యుద్ధంలో పోరాడు తున్నారు. విద్యార్థులందరు సైనికులుగా చేరారు. చావటానికైనా ఒప్పుకుంటారుగాని, ఈఫాసిస్టు నిరంకుశత్వమునకు ఒప్ప కోరు స్పానిష్ ప్రజా సామాన్యం.

విద్రోహుల సైన్యంలో తిరుగుబాట్లు జరుగుచున్న విషయంగూడ అందరు గుర్తెరుంగవలెను. విదేశములనుండి వచ్చిన జర్మను, ఇటాలియను సైన్యాధికారులకు ఎక్కువజీతం, ఎక్కువ అధికారం: ఇదంతా మిగత సైనికులకు, మొరాకోనుంచి వచ్చిన సైనికులకు ఏమాత్రం గిట్టటంలేదు. అదేగాక విద్రోహులు చేసే ఈతిరుగుబాటు అన్యాయమని అక్రమమని, ప్రస్తుతం, విద్రోహుల సైన్యంలోని సైనికులకే అర్థమవుతున్నది.

ఇటలీ, జర్మనీలుగూడా ఎంతకాలమని సహాయం చేయగలవు: అబిసీనియా యుద్ధంతో, ఇటలీయొక్క అంతర ఆర్థికపరిస్థితులు దుర్భరముకాలేదా: అందువని. ఇటాలియను వర్తకులని స్పానిషు యుద్ధమున పొరాటం చేయుటకు ఇటాలియన్ ప్రజలు ఒప్పుకుంటారా: అదేగాక, అబిసీనియాలో, ఆదేశస్థులు ఈరోజు జనరంజకంగా చేస్తున్న తిరుగుబాట్లను అణచుటకే పంపిస్తాడా సైన్యాన్ని అబిసీనియాకు, లేక ఫాసిస్టుల తిరుగుబాటుకే సహాయంచేస్తాడా ముస్సోలినీ: జర్మనీలో గూడా పరిస్థితులు మారుతున్నాయి. సైన్యంలో అనేక మార్పులు జరుగుచున్నాయి. దీనికంతా హిట్లరు నిరంకుశ విధానముమీద ప్రజలకు కలుగుచున్న అసంతృప్తియే: కారణం. జర్మనీలో కమ్యూనిజం అణచివేయబడినదే గాని, నాశనం కాలేదనిగూడ తెలుసుకొనుట ఆవశ్యకం.

కనుకనే విద్రోహపక్షం కొన్ని రోజులలో జయం కలుగుతుందనే ఉద్దేశ్యంతో తిరుగుబాటు చేస్తే, ఇప్పటికి 20 నెల్లయింది. ఉద్దేశ్యం నెరవేరకపోగా, ప్రజా ప్రభుత్వానికి అన్ని దిక్కులనుండి సహాయం, సానుభూతి ఎక్కువగుతున్నది. తటస్థవిధానమను దొంగ నాటకం ప్రతివారికి అర్థమయింది. కామ్రేడ్ రాల్ఫ్ ఫాక్స్ మొదలైన కమ్యూనిస్టు వీరులు ప్రజాప్రభుత్వ విజయం కొరకు, ఫేసిజం నశించేందుకు హత మగుచున్నారు స్పానిషుయుద్ధంలో. ఇంటర్నేషనల్ బ్రిగేడ్ లో వివిధ దేశములనుంచి వలంటీరులుగా వచ్చినవారు ప్రజా ప్రభుత్వం వైపు పోరాడుచుండగా, స్పానిషు ప్రజా ప్రభుత్వమునకు జయం చేకూరదా.

ఈస్థితిలో, ఇటలీ, జర్మనీలతోపాటు, ఫేసిస్టువైఖరితో విద్రోహులకు సహాయపడుచున్న బ్రిటిషు సామ్రాజ్య తత్వాన్ని కాలనీలలోని ప్రజ లందరు ఖండింప తగియున్నది. గొప్ప "ప్రజా ప్రభుత్వమ" ని చెప్పుకొనే బ్రిటన్, సామ్రాజ్య వ్యవహారములలో ఫేసిస్టులతో చేరి, అవలంబిస్తున్న సామ్రాజ్యవైఖరి అందరు గుర్తెరుంగవలెను.

కనుకనే, స్పానిషు ప్రజా ప్రభుత్వమునకు సానుభూతి చూపుటకు చేయు ఆందోళనమే, సామ్రాజ్య వాదమును ఫేసిజమును ఖండించుటకు చేయవలసిన ఆందోళనయగును. ఈ ఆందోళన స్పానిషు యుద్ధం యొక్క నిజమైన అర్థం తెలియబరచుటయే గాక సామ్రాజ్య వ్యతిరేక పోరాటమును బలపరచుటకు సహాయపడును.

స్పెయిన్‌లో జరిగే వర్గ పోరాటం, ప్రతి దేశములోను జరుగవలసియున్నది. ఈరోజు స్పెయిన్‌లో బయలుదేరింది. రేపు ఇంకో దేశంలో—అంతే భేదం....



బందరు హిందూ కాలేజీలో సమ్మెచేసిన విద్యార్థులు

## ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘః

సర్క్యులరు నెంబరు 1—1938 — సవరణ

నామినేషనులు పుచ్చుకొనుట అనుచోట జిల్లా తాలూకా పట్టణ డివిజనలు కమిటీలకు నామినేషనులు పుచ్చుకొనుట అని చదువవలెను షరా:—ప్రతి జిల్లా కాన్స్టిట్యుయన్సికి నాలుగు తాలూకా స్థానములు గనుక ఆకాన్స్టిట్యుయన్సిలో ప్లూరలు నియోజకవర్గముగా ఎంచుకొని ఎన్నికలు జరుపవలెను.

2-2-1938

### రాష్ట్ర మహాజనసభ

ఈ సంవత్సరం జరుపవలసిన ఆంధ్రరాష్ట్ర మహాజనసభను బళ్ళారి జిల్లాలో జరుపుట కిదివరలో నిర్ణయించబడినది. ఇపుడాప్రాంతమున క్షామముగుటచే వారీ సంవత్సరం సభల జరుపజాలమని వ్రాసియున్నారు. గాన యీ సంవత్సరం ఆంధ్రరాష్ట్ర మహాజనసభ జరుప నుత్సాహము గల జిల్లావారు వెంటనే మా కార్యస్థానమునకు తెలుప ప్రార్థన. బహుశః ఏప్రిల్, మే నెలలలో సభ జరుపవలసి యుంటుంది.

### ఆక్షేపణలు

ఆ యా జిల్లాల నియోజక వర్గములనుగూర్చిన ఆక్షేపణల విచారణ యీ దిగువ వివరించిన ప్రకారం జరుగును:

1. విశాఖపట్నం 1-3-38 తేదీ 11 గంటలనుండి జిల్లా కాంగ్రెసు సంఘ ఆఫీసులో-విజయనగరం.
2. తూర్పుగోదావరి 1-3-38 11 గంటలనుండి జిల్లా కాంగ్రెసుసంఘ ఆఫీసులో. కాకినాడ.
3. పశ్చిమగోదావరి .. .. ఏలూరు
4. పశ్చిమకృష్ణా .. .. బెజవాడ
5. నెల్లూరు .. .. నెల్లూరు
6. కర్నూలు .. .. నంద్యాల
7. అనంతపురం .. .. అనంతపురం

గో॥ బ్రహ్మయ్య,
ప్రధాన కార్యదర్శి

★

### గుడివాడ తాలూకా కాంగ్రెస్

9—2—38 తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నిక జరిగింది. కాంగ్రెస్ సామ్యవాద కార్యనిర్వాహక సభ్యులును, జిల్లా రైతుసంఘ కార్యదర్శి యగు కానూరి బలరామయ్యగారు అత్యధిక ఓట్లతో విజయమందారు.

ఈ ఎన్నికనుగురించి, తాలూకా, జిల్లా కార్యదర్శులకు వివాదం జరిగింది. ఆం. రా. కాంగ్రెసధ్యక్షులు జారీచేసిన 2 వ సర్క్యులర్ ప్రకారం ఈ ఎన్నికలు జరుపుట పరస్పర విరుద్ధం అని తాలూకా కార్యదర్శి యగు శెట్టిపల్లి వెంకటరత్నంగారి వాదన. ఎన్ని యెత్తులు వేసినను చివరకు అతివాదులే ఈ ఎన్నికలో విజయ మందారు.

★

### మున్షీ స్మారకదినం.

12—12—38 వ తేదీన నిరశనవ్రతములో చనిపోయిన హరీంద్రనాథమున్షీ స్మారకదినం, బందరు, యండగండి, గుమ్మలూరు, యలమర్రు, ఒంగోలులో జరిగినది. ఇంకా ఇతర నగరాలలో విద్యార్థులు, సోషలిస్టులు, యువజనులు సభల జరిపినట్లు తెలియజేయుచున్నారు.

# కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ

## కృష్ణా

కృష్ణాజిల్లా కాం. సో. పార్టీ కార్యనిర్వాహక వర్గ సభ యీ నెల 27 వ తేదీ ఆదివారము మధ్యాహ్నము 2 గంటలకు గుడివాడతాలూకా కాంగ్రెస్ ఆఫీసునందు జరుగును. కాన కార్యనిర్వాహక సభ్యులందరు తప్పక రా గోర్తాను.

వెల్లంకి విశ్వేశ్వరావు
ప్రధాన కార్యదర్శి,
కృ. జి. కాం. సో. పార్టీ,

★

## గుంటూరు

గుంటూరుజిల్లా కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశము యీ నెల 27 వ తేదీన గుంటూరు సోషలిస్టుపార్టీ ఆఫీసునందు ఉదయం 8 గంటలనుంచి జరుగును కాన సభ్యులందరు తప్పక హాజరు కావలెను.

1. పార్టీ రిపోర్టు.
2. రాబోవు జిల్లాకాంగ్రెస్ కమిటీ యెన్నికలు.
3. ప్రజాసంఘాల కార్యక్రమం.
4. జిల్లా యువజన మహాసభ.
5. పార్టీ నిర్మాణ విషయం.
6. పార్టీ ఆర్థికం.
7. కార్యదర్శి పెట్టు యితర విషయాలు.

తెనాలి
15-2-38

ఇట్లు
పి. నరసింహామూర్తి.
కార్యదర్శి.
జిల్లా కాం॥ సో॥ పార్టీ.

# చీరాల కాల్పులు

చీరాలలో కార్మికులను కాల్చినందుకు అసమ్మతి తెలుపుతూ, చనిపోయినవారి, గాయపడినవారి కుటుంబములకు సానుభూతి తెలుపుతూ, అధికారుల చర్యల నిరసించుచూ, రాజమండ్రి, ఇందుపూరు, ఒంగోలు, గుంటూరు, తెనాలి, బెజవాడ మొదలగు పట్టణములలో సభలు జరిగినవి. ఇంకను అనేక గ్రామముల నుండి, పట్టణములనుండి ఈ అసమ్మతి సభల వృత్తాంతాలు వచ్చుచున్నవి.

★

# యువజన సంఘాలు.

గుంటూరుపట్టణ "యూత్ గార్డ్సు"
యొక్క జమాఖర్చు

ఖర్చు.

| | |
|---|---|
| కామ్రేడ్ సి. రాజేశ్వరావుగార్కి నెల, రోజులులకు యిచ్చినది | రు 25—0—0 |
| టోపీలు | 3—0—0 |
| కర్రలు | 3—0—0 |
| సండ్రీ | 5—0—0 |
| | 36—0—0 |

| | |
|---|---|
| వసూలు అయినది | 46—8—0 |
| ఖర్చు మొత్తం | 36—0—0 |
| మిగిలిన మొత్తం | 10—8—0 |

సి. పి. సారధి
సెక్రటరీ ప॥ యు॥ సం॥
గుంటూరు.

గుమ్మలూరు, రాలి గొప్పు గ్రామాలలో యువజన సంఘాలు స్థాపించబడినవి.

★

## యువజన యాత్ర

25 మంది యువజన సభ్యులు హంసల దీవికి వెళ్ళి సముద్రస్నానమునకు వచ్చు యాత్రికులకు రాజకీయ ప్రబోధము గావించిరి.

స్వాతంత్ర్య పోరాట చరిత్ర—మంత్రులూ—రైతు సంఘాలగురించి, రాజకీయ ఖయిదీలగురించి వేములపల్లి రాజగోపాలరావు, కోనేరు రాజగోపాలరావు, కంఠంనేని అచ్యుతరామయ్య గారలు మాట్లాడిరి.

దీవి పురుషోత్తం.
అధ్యక్షుడు,
నాగాయతిప్ప యువజన సంఘం.

# అమృతాంజనం

## అన్ని నొప్పులకు దివ్యామృతం

### సుధాచంద్రిక

సీసా 1కి రు 2—0—0

సుధాచంద్రిక నీరసము కాంతాయులకు క్రిములను సంహరించి వ్యాధిని మొదలంటు రూపుమాపును. మొదటి మోతాదులో స్రావము కట్టి వేయును. మూత్ర నాళమందలి మంట పూర్తిగా తగ్గించును. ఇతర ఔషధములకు లోబడని కేసుల సహితము నయమగును.

### సంతానసుధాకరం

తు1కి రు 10—0—0

సంతాన సుధాకరం తు 1 కి రు 10—0—0 లు శాస్త్రీయముగ తయారు చేయబడినది. దీని దాంపత్యమును కలుగ చేయుట నిస్సంశయము. అతి మాత్రము. ... ప్రసిద్ధి కెక్కినది. కేటలాగు ఉచితం.

క్షీరసముద్రం ఫార్మసీ,
రాజమండ్రి

### మరబియ్యం తినడం?
### మరణ బాధ పడడం?

★ మానవ జీవితానికి ఆహారం అవుసరం

★ ఆహారంలేక జీవించడం అసంభవం

పుష్టికర ఆహారం ఆయుర్దాయాభి వృద్ధికల్గించుతుంది.
కాని మీరుతినే మిల్లుబియ్యంలో
పుష్టికర పదార్థాలు లోపించివుంటాయి
అందువల్లే అజీరణం-ఆది మ్కు-తీ శుష్కించిపోవడం
లోపించిన పదార్థాలు చేరుకొనేందుకు దంపుడు బియ్యం వాడాలి మేము గత ఐదు సంవత్సరముల నుంచి స్వయముగ ధాన్యం దంపించి విరివిగ సప్లయి చేయుచున్నాము. మానమ్మకమును వెల్లడి చేయుటకు మాకుగల యోగ్యతాపత్రములే సాక్షి.

భమిడిపాటి సూర్యనారాయణమూర్తి
అండ్ బదర్సు,
గంగానారి రోడ్డు, రాజమండ్రి.

### వెంకట్రామా అండు కో

మావద్ద సమస్త సంస్కృత, ఆంగ్ల, ఆంధ్ర, హిందీగ్రంథములు, స్కూలు పుస్తకములు, నాటకములు, వైద్యగ్రంథములు వగైరా సరసమైన ధరలకు దొరకును. కేటలాగు ఉచితముగ పంపెదము.

భగవద్గీత :— శ్రీశంకరభాష్యము. శ్రీకళ్యాణానంద భారతస్వాములవారి విపుల ఆంధ్ర టీకాతాత్పర్యములతో— 3—0—0

హెడ్డాఫీసు:— ఏలూరు; బ్రాంచిలు మద్రాసు, తెనాలి, బెజవాడ, పాలకొల్లు, సికింద్రాబాదు, (నైజాము.)

వెంకట్రామ అండు కో
బ్రాంచి: రాజమండ్రి,

పీట్రో

### మీరు ఏల బాధపడెదరు ?

★ ★ ★

ఏజంట్లు లేని చోట్ల ఏజంట్లు కావలెను.

మూలవ్యాధి కన్న భరింపరాని బాధ మరియొకటిలేదు. మీరు ఆ వ్యాధితో బాధపడుచున్న యెడల పీట్రో వాడి వెంటనే స్వస్థత చెందుడు పీట్రో కొద్ది నిమిషాలలోనే బాధ తగ్గించును. ఎట్టి మొండి వ్యాధినైన ఆపరేషను లేకుండగనే నిర్మూలము చేయును.

★ అనేక డాక్టర్లచే మెప్పును పొందినది ★

ఒక అర్ధణా బిళ్ల పంపువారికి శాంపిల్ ఉచితముగా పంపబడును.

వివరములకు:

పీటో మాన్యుఫేక్చరింగ్ కంపెనీ, రాజమండ్రి.

పీటో ప్రతిచోట దొరకును

Printed by V. Suryanarayana Sastry at Srinivasa Press and Edited and Published by M. Annapurniah } Rajahmundry.

